శ్రీరస్తు.

# సురానంద.

శ్రీ సంపూర్ణరామాయణాది వివిధ గ్రంథకర్త యగు

## కొడాలి సత్యనారాయణరావుచే

రచియింపఁబడినది.





మొదటి కూర్పు 1000 ప్రతులు.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1924.

 [వెల రు 1—0—0

# కృతిసమర్పణము.

పీఠికాపుర సంస్థానాధీశ్వరులును, సంఘసంస్కరణాభిలాషు
లును, ఆంధ్రభాషాసతీపోషకులును, అనాథరక్షకు
లును, మహారాజేత్యాది బిరుదాంకితులును నగు
శ్రీ రాజా రావు వేంకట కుమారమహీపతి
సూర్యారావు బహద్దరు వారికి యీనా
కృతిని వినయపూర్వకముగ సంకిత
మొనర్చుచున్నాఁడను.



---

శనివారపుపేట,
తా 10.6 24.

ఇట్లు
కొ. సత్యనారాయణరావు.

# పత్రిక.

ఆంధ్ర మహాశయులారా!

నా గ్రంథమాలా ప్రథమ ప్రచురణమగు తులసీదాసు వెలువడి చాలకాలమయినది. అప్పటినుండియు నా తలంపు లన్నియు విచ్ఛిన్నములయినవి. మున్ముందెంత గౌరవాదరణముఁ జూపెదనని వాగ్దత్త మొనర్చిన [illegible] కుమారరాజా వారగు శ్రీ నారయ్యప్పారావు బహద్దరు వారును, అత్యంతాదరణమున నన్నుఁ జేరఁదీసి వార్షికంబుగ నూటపదారుల నిత్తుమనియు మఱియు నెంతెంతయో యీయఁదలఁచితిమని వీపుఁ దఱచి చెప్పిన శ్రీవనపర్తి మహారాజా వారును స్వర్గస్థులగుటచే నొక్కఁడులేని పక్కినై దిక్కులేక నల్లాడితి. ఈ ప్రమాణమును గూర్చి యాంధ్రలోకంబున కిదివఱకే తెలియపఱచిన వాఁడనగుటఁ జేసి నాకు నిరంతరమును వచ్చుచున్న పుత్తరములను బట్టి వారికిఁ బ్రత్యుత్తరములు వ్రాయుటకు సిగ్గుపడుచు నిఁక ముద్రింపకఁ దప్పదని సాహసించితి. సాంఘిక నాటక రచనంబున నియ్యది ప్రథమంబగుట కథాసంవిధానమునందు విమర్శనల కాఁగఁగల్గుదునను ప్రగల్భములఁ బలుకుట నామతము గాదు. పాఠక మహాశయుల నిరంతర ప్రోత్సాహంబున నభివృద్ధిలోనికి రాఁగల్గుదును.

ఏ కార్యమునకైనను బ్రకృత పరిస్థితుల ననుసరించి భుక్తి, ముక్తి, భక్తి, వీటి మూటినిఁ జూచుకొనవలయుఁ గదా! మహారాజుల యొక్కయు, జమీందారుల యొక్కయు సహాయములేనిదే యితరుల నెందఱిని నాశ్రయించినను ఫలితంబు స్వల్పంబే. కృతిసమర్పణమున మహారాజుల మనంబునం దిడుకొనినఁ బైమూటికిని సార్థకంబుగ నుండును. ఎంతభక్తిచేఁ గృతినిచ్చినను భుక్తినిగూర్చిన భావముండకుండునా యని కుత్సితస్వభావులు దలంచవచ్చును. కాదన నేల? వారియెడల మనభక్తిని జూపినచో వారు మన భుక్తికింత చేయూఁతనిచ్చిన వలదని నిరాకరించు వారుందురా? వారి గౌరవములను బ్రకటించుకొనుట యందు వెనుదీయుదురా? ఇట్టి కుశ్శంకలు నిరుద్యోగులకే గదా! నా స్వానుభవమును బట్టి కొన్ని ప్రదేశములయందుఁగల ఆశ్రితులు తమయసూయా స్వభావములను వెలిఁబుచ్చుకొనుచు నాశ్రయింప వచ్చిన పరులను గూర్చి తమ ప్రభువులతో నిరసనగ మాటలాడుచు వచ్చినవారిఁ బరిభవించి పంపుటలో నతిప్రజ్ఞావంతులుగలరని యూహించుకొంటిని. అట్టి ప్రదేశములు గాకుండఁగనే సాధ్యమగునంత వఱకుఁ జూచుచు సత్కరింపఁ బడుచుంటిని. పిఠాపుర సంస్థానాధీశులకు మదీయ కృతిని అంకితమొనర్చుట యందు వారిగుణగతములను గృతిసమర్పణములోనే విన్నవించుకొంటిని. శ్రీ వారి యొక్కయు వారి యనుచరుల యొక్కయు యోగ్యతలను బట్టి యీ కృతికన్యను వరింప వారే యోగ్యులని నిశ్చయించుకొంటిని. ఎవరినో మనంబున నిడుకొని వారి గౌరవము లభించలేదని మఱియొకని ధనమును బట్టి కృతికర్తలను చేయుట యోగ్యము కాదని దృఢాభిప్రాయము. అయ్యది నీచస్వభావముగఁ బరిగణింపఁ

బహుశనేమో యని గూడ నాకు భయము. ఇట్టి సాంఘిక నాటకంబునకు మహామహుని కృతిభర్తగఁ జేయుట కెంతవఱకు యోగ్యతయో పాఠకమహాశయులకు వదిలితి. యోగ్యులు తమరిని కృతిభర్తలుగఁ జేయుదునని దెలిపిన సరేనని చివాలునఁ దలయొగ్గుదురా? మన కీర్తిని సహాయము ప్రకటించుకొనినఁ బిమ్మట సంగతులు వారియనుగ్రహాధీనము గాన నింతటితో ముగింతు.

ఇఁక నాటకరచనమును గూర్చి నేనంత యెక్కువగా వ్రాయఁదలఁచలేదు. ఎందుచేతనన నొకఁడు వ్రాయుబోవుని చర్యను బ్రదర్శింపవలెనని నిర్ణయించెనని గ్రహించుట దుష్కరము. తలకొక తెలివి వ్యవహారము. అందుచే మన హృదయాంతర్గతాభిప్రాయము దేశానర్థదాయక మగు త్రాగుడును బహిష్కరింపుమని ప్రబోధించుటయే గాన నిందలి దోసంబులన్నిటిని త్రోసివేసి ప్రధానాంశమును మాత్రమే గుర్తించి ప్రోత్సాహము సలుప వినమ్రుఁడనై పాఠకుల నర్థింతును.

మున్ముందంగీకారముఁ బడయకున్నను నాస్వల్పకీర్తిని ప్రకటించుకొనినందులకుఁ గృతికర్తలు నన్ను క్షమించుటయే గాక నన్నాదరింతురని గూడ విశ్వసించుచు శ్రీ వారికిని వారి కుటుంబమునకును దీర్ఘాయురారోగ్యముల నొసంగి పరిపాలింప నాగేశ్వరుని భజించుచు నింతటితో నావిజ్ఞప్తిని ముగింతు

శనివారపుపేట,
10—6—24.

ఇట్లు విధేయుఁడు
కొ. సత్యనారాయణరావు.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

సూత్రధారుఁడు.

మారిషుఁడు.

సురానందుఁడు.

గిరిమూర్తి.

బట్లరు.

గణపతిరావు.

గురవఁడు.

వెంకఁడు.

కోటప్ప,

నరసింహ్వాం.

సుశర్మనుఁడు.

రాముఁడు.

మాధవరావు.

కొండప్ప.

కాంపౌండరు.

డాక్టరు.

బంట్రోతు.

గావాజి

## స్త్రీలు.

ఇందువదన.

భరతమాత.

జానకమ్మ.

సమర్థులగు నటకులు దీనిని ప్రదర్శింప యత్నించవచ్చును.

శ్రీ

# రామరాజోద్వాహము

చరిత్రాత్మక నాటకము. వీరరస ప్రధానము. రామరాజు యొక్క యపరిమితమాన శౌర్యమును, మూరు రాయరగండఁడని విఖ్యాతిఁ జెందిన శ్రీకృష్ణ దేవరాయలవారి పుత్రికయగు తిరుమలాంబను వివాహమాడుటకు పొందిన కష్టములు, చేసిన చిత్రములు, తాల్చిన రూపములు. వేసిన యెత్తులు, చూపిన పరాక్రమములు, చక్కఁగా వర్ణింపఁ బడినవి. వెల రు 0-12-0 లు మాత్రమే. శైలిఁ దిలకింపుఁడు.

గీ. కుప్పలుగఁ గుట్రదారులు ♦ కూలువఱకు
హంతకుల శీర్షములు తెగు ♦ నంతవఱకు
నాంధ్రరాజ్య రమాధిపుఁ ♦ డైనకృష్ణ
దేవరాయుండు సన్నుఁ గీ ♦ ర్తించు వఱకు
మదినిగలయట్టి కోర్కెలిం ♦ పొంగవు వఱకు
ధర్మమును శాంతిప్రజలలో ♦ దనరి మఱల
విజయనగరంబు ప్రతిభతో ♦ వెలయువఱకు
మనమునకు శాంతి, సుఖమను ♦ మాటకల్ల.

వలయువారు:—

హనుమంత విలాస్,
శనివారపుపేట.



శ్రీరామచంద్ర.

# సురానంద.

## నాంది.

ఉ. మందగతిన్ జరించెడు కు ♦ మార్గచరిత్రుల నంతరాత్మయం
మందలపోయుచున్ గరుణ ♦ తోడుత జాలి వహించి సత్పథం
బందునఁ జేర్పఁగాఁదగు ద ♦ యారసచిత్తులఁ బ్రోచునా సురా
నందుఁ దలిప్రయోగతి స ♦ నారత మేలుత నీ సదస్యులన్. 1

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి) మారిషా! ఒక్క సారి యిటు రాఁగలవా?

మారి—ఆర్యా—అత్యంతావసరంబుగ నన్నురావించిన గతంబేమి?

సూత్ర—ఓయీ! అవసరముగాదా? చూఁడు.

గీ. ఆర్యమతసాంప్రదాయంబు ♦ లంతరించెఁ
బ్రీతిమెయి వాటిఁ బునరుద్ధ ♦ రించి దేశ
మాతగౌరవమును నిల్పి ♦ మాకుఁ దగు స
హాయమొనరించుఁడీ యను ♦ చనవరతము
వేఁడుచున్నారు మనలను ♦ విబుధవరులు. 2

మారి—దేవా! నాటకములన్న నతిహీనముగఁ జూచు విబుధవరు
లేరి? మన సహాయము నపేక్షించు టేమి?

సూత్ర—అవన్నియుఁ బూర్వాచార పరాయణుల సంగతులు. ప్రద
ర్శనాదర్శములను బాగుగా గుర్తెఱిఁగిన యీ దేశోద్ధారకులకుఁ
బ్రదర్శనములయందు హేయభావము లేదు సుమా ! మారిషా—

మ. స్థిరసంకల్పముఁబూని పూర్వకవులే ♦ దృశ్యప్రబంధంబులన్
వరలన్ జేసి దేశమెల్లగతులన్ ♦ బాగొంచు వర్ధిల్లఁగా
సరిఁజేయందగు మార్గమిద్దియను వి ♦ శ్వాసంబుతో నట్టిచోఁ
బరగాశ్చర్యమె వేఁడినారనఁగ ? భా ♦ వా ! యెంతయజ్ఞానివో.

మారి—సరే ! అందులకు మనము చేయఁదగిన దేమి ?

సూత్ర—మని యీ ప్రశ్నింతువు ?

గీ. సంఘమందునఁ గల దురా ♦ చారముల వి
సర్జన మొనర్పఁదగిన ప్రో ♦ త్సాహ మొసఁగు
నాటక మొకండునాఁడ యీ ♦ నాఁడ ప్రేక్ష
కులకు మనమెల్ల మోదంబుఁ ♦ గూర్పవలయు. 4

మారి—భావగారు ! మన యాంధ్రభాషయందట్టి సాంఘిక నాట
కములు చాల తక్కువ గదా ?

సూత్ర — అవును. కారణమేమియో యెఱుంగుదువా ?

గీ. కవులను దరిద్రదేవత ♦ గట్టి పట్టుఁ
బట్టి క్షణమేని విడియుండ ♦ దట్టికార
ణంబున రచించుటందుమహా ♦ నంబుఁదాల్చి
యున్నవారందుచేనవ్వి ♦ యున్నయవ్యె.

ఈకారణంబుచేఁ గుటుంబ భరణార్థము నోదా యొకగాథ
నల్లుకొని.

శా. చెప్పన్ శక్యముగాకఁ గన్పడెడు బుక్ ♦ కెల్లన్ప్రహస్తంబునన్
దొప్పన్ జెప్పి పదోపదేనోగొని యే ♦ సోవచ్చోఁ బోమ్మంచునన్

గొప్పకవమ్మొనరించుకొంచుఁ గవులీ ♦ న్యూనంబులో నుంటచేఁ
దిప్పల్ వచ్చెను గాలమీగతిని వే ♦ ధింపంగనయ్యెన్ జుమీ.

మారిషా—వారిని జూచినప్పుడెల్ల నా హృదయము కటకటఁ బడక మానదుసుమా.

మ. ధనవంతుల్ గరుణార్ద్రచిత్తులయియు ♦ ద్వ్యగ్రంథ పోష్యంబునం
దునఁ జిత్తంబులనిల్పి గేని క్షణము ♦ దున్ దేశభాషాభి వృ
ద్ధిని జేయన్ దల పూనరే కవులు ? నే ♦ దీయట్టి భాగ్యం బటం ?
చునునా నెమ్మనమందుః దుఃఖముజనిం ♦ చున్ నిత్యమున్ మారిషా

మారి—బావగారూ ! మీరు బలఁ పలపోయుదురేల ? కాలమొక్క రీతి గడవదెపుడను నార్యోక్తిని వినమా ? ఏనాటికైన నమ్మహాసీయులకు జాలిగలుగకపోదు. కాన శాంతమును శరణ్యముఁజేసికొని యట్టి సత్కాలమునకై నిరీక్షించెదము. ఈశ్వరుఁడంతటి నిర్దయుఁడా ? భాషామతల్లిని గాపాడఁడా ? దానికేమి గాని మన మిప్పుడే నాటకమును బ్రదర్శించి వీరల కానంద మొసంగుదము.

సూత్ర—లేదా ! "సురానంద"

మారి—సురానందయా ! దాని పేరే నే నెన్నఁడు వినియుండలేదే !

సూత్ర—వినలేదా ?

మ. తులసీదాసు కబీర్ చరిత్రముల న ♦ త్యుత్సాహతన్ వ్రాసి మె
ప్పులఁగైకొన్న యతండు, రామకథ సం ♦ పూర్ణంబుగా వ్రాసిమ
త్కాలమున్ బావనఁ జేసితన్ముఖముకున్ ♦ గొన్నట్టి భక్తుండువీ
నులకున్ విందొనరింపవ్రాసి మనముం ♦ గున్ బెట్టెఁగా మిత్రమా

మారి—ఆతఁడు పాదుకా పట్టాభిషేకమును గూడ వ్రాసియుండెనా ?

సూత్ర—అవును ఏతత్కవికృత నాటకములలో నిదియొకటది.

మారి—ఆర్యా ! నామందమతిచే నా కవి నామము నే మరచితినిసుమా ?

సూత్ర—అది మఱచుట కాదు. నాటక ప్రారంభమునకుఁ బూర్వము కవిని స్మరింపకుండుటాచారవిరుద్ధంబని వేసినయెత్తు. ఎట్లయిన నేమి? స్ఫురణకుఁ దెత్తును చూడు!

మ. ఘనతన్ గన్న కొడాలివంశజుఁడు; వేం ♦ కయ్యార్యుపుత్రుండు దా
నను జూండ్రో శివరామకృష్ణునకు నా ♦ హ్లాదక పారీణుఁడై
చిననాఁడే కవితంబు నేర్చిన యశ ♦ శ్రీ సత్యనారాయణుం
డను నామంబున వెల్గు నాతఁడు హితుండౌ! జ్ఞప్తికిన్ వచ్చెనే.

మారి—బావగారూ! వారి నాటకంబులఁగూర్చి పలువురు పలువిధంబుల అభిప్రాయ పడుచుండిరిగదా! అట్టి స్థితిలో వీరి నాటకములఁ జూచి యాదరింతురా?

సూత్ర—అదే వెఱ్ఱి. కవిమనోభిప్రాయముల గుర్తెఱుంగనేరని యువజ్ఞులు కొందఱట్టి యవకతవక విమర్శనంబు లొనర్తురు. అట్టి వారి మాటల లెక్కపెట్టనేల? కవి యభిప్రాయమిది.

సీ. పండితాలికి ప్రశ్నప్ర ♦ బంధము లన
వసరమగు పామరులక ♦ వశ్యమగును
అందుచేవారి కనువగు ♦ నట్టిరీతి
వ్రాయవలెనను తలఁపుచే వ్రాయునటులె. 9

మారి—సరే అట్లయిన మన మింక నాలస్య మొనర్పనేల? నాటక ప్రారంభమునకై గడంగెదమా?

సూత్ర—అవును. మఱచితి. పాత్రల నాయత్తపఱచి నాటకమాడించుభారంబు నాయందుఁ గలదని యెఱింగియుండియు గాలహరణ మొనర్చుచుంటిని. పోవుదముపద.

(నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన.)



శ్రీ

# సురానంద.

## ప్రథమాంకము.

(సురానందుని గృహములో సురానందుఁడు ప్రవేశము).

సురా—(స్వగతము) అమ్మయ్యా ' తలపీడవదలినది.

చ. బ్రతికిననాళ్లువాఁడు నను ♦ బట్టిపలార్చి యనేకరీతులన్
జితుకఁగఁగొట్టితిట్టి యిటు ♦ చేసిన దుష్టుఁడుచచ్చె వహ్వరే!
బ్రతికితి నాకిఁకెట్టికొదు ♦ వల్గలుగున్ ? సుఖభోగినౌచు నీ
క్షితి మనినంతకాల మెటు ♦ చేసిన నడ్డదువారలుందురే ?.

ఈ ముసలిముండకొడుకు బ్రతికినంతవఱకు రాగిడబ్బైనను జేతికిఁ జిక్కక నేనుపడిన శ్రమ యాభగవంతునికే తెలియవలయును. ఆవిధమగు కాపినముఁగల్గి యహర్నిశలును యినుపపెట్టెకు సేవఁజేసి నవాఁడు చివఱకుఁ జచ్చునాఁ డొక్కపైసయేని వెంటఁగొనిపోలేకపో యెనేమో ? పోనీ ! యేదో భగవంతుఁడిచ్చినందులకుఁ తానేనిఁ గడు పునిండఁ గూడుఁదిన్న పాపమునఁ బోయెనా ?

గీ. పాతరలఁగోడి ధాన్యమా ♦ వరుసనుండ
ముక్కపురుగులమూకలే ♦ భుక్తికయ్యెఁ
పెట్టెలన్నింట జలతారు ♦ బట్టలుండఁ
బాతకొల్లాయియే కట్టు ♦ బట్టయయ్యె.

అబ్బా ! ఎంతకాలమునకు నేను ఋణవిముక్తుఁడనయి స్వేచ్ఛగా మెలంగు దినంబులు వచ్చినవి ? ఇఁకఁ గావలసినంతస్వాతంత్ర్యము !

సీ. రెఫ్రిష్మెంటువా ♦ రికి నీయవలసిన
బిల్లుమొత్తముఁ జెల్లుఁ ♦ బెట్టవచ్చు
గిరిమూర్తిగాడిక ♦ గ్రిజ వాడుకొన్నట్టి
బాకినంతయును దీ ♦ ర్పంగవచ్చు
పేకాటలో మొన్నఁ ♦ దాకట్టుఁ బెట్టిన
గొలుసును విడిపించు ♦ కొనఁగవచ్చు
సింహాచలమువద్ద ♦ సిగరెట్లువాడిన
వెధవబాకీ పార ♦ వేయవచ్చుఁ

గీ. జాలకాలమునుండి నా ♦ స్వాంతమందు
నున్న నాయిందువదనతో ♦ నుండవచ్చు
భోగములతోడ నిఁకఁ దుల ♦ దూగవచ్చు
హాయిరే! యెంతస్వాతంత్ర్య ♦ మబ్బెనాకు.

గిరి—(ప్రవేశించి స్వ) ఏపథమునన్నైన నేమి. నా ప్రభావమంతయు వినియోగపఱచి స్వయముగ ముందుధనమును వెచ్చించి సురానందునకుఁ ద్రాగుడు నేర్పితిని. పేకాట నలవాటుఁ జేసితిని. సిగరెట్లుగాల్చు నటుల నొనర్చితిని. వేశ్యలింట్లకు మార్గంబుఁ జూపితిని. చోరగ్రహణంబున నధికునిఁ జేసితిని. దెబ్బలాటల యందుఁ బ్రవీణుని గావించితిని. కాని దండ్రి జీవించి యుండుటచేతఁ జేతి కేమియు దొరకకుండుటచే గాని పేరు బైటకు రాలేదు. ఆ కొంతకూడ తీరిపోయినది. ఇఁక వీని నాచేతిలోఁ గీలుబొమ్మఁ జేసి యాడింపవచ్చును. వీని కొఱకెంతయో స్వంతద్రవ్యమును వెచ్చించితిని. ఇంతకుఁ బదింతలు లాగవచ్చును. ఎందులకో వర్తమాన మంపినాఁడు. తనకుఁ గల్గిన స్వాతంత్ర్యమును గూర్చి నాతో ముచ్చటించుటకే యైయుండవచ్చును. (ప్రకాశముగా) మిత్రమా! ఎందులకో అత్యంతావుసరముగా వర్తమానమంపితివి?

సురా—ఏమగో వచ్చితివా! మిత్రమా! కూర్చుండుము.

గిరి—కూర్చుండుటకేమి కాని నీ వదృష్టవంతుఁడవోయి.

సురా—నీదయవల్ల:-నాతండ్రి.

గీ. రాత్రిరియుఁ బవలును గన్ను ♦ రెప్పలవలెఁ
జెఱచుకొని యున్న పెట్టె న ♦ వ్వారు హారింతు
రోయనుచుఁ గావలినిగాయు ♦ చుండువాఁడె?
యింత కాలవమేమయ్యె ♦ నంతమునకు.

గిరి—నీ తండ్రి యెంత కాలీనుఁడై యున్నను నీ కొఱకే గదా? ఆతఁ
డావిధమున దాఁచిక మనవలనే సుందరపురుషుఁడై పూలరంగడి
వలెఁ దిరిగిన మన కిప్పటికేనియు సుఖమేది?

సురా—మా నాయన కర్మలో నుండుటచే నిన్నుఁ జూచుటకే యవ
కాశము లేకపోయినది. అబ్బా! దినమొక్క యుగముగా గడిపి
తినన్నమూ...

గిరి - మఱి మనకు మేన్నఁడు!

సురా—ఇఁక నిత్యమును మేజులేగదా. పేరయ్యశాస్త్రిగారికి చేయ
వలసినది, నీకేయవలసినది ఆశాకి యీశాకి అన్నియు నేను వదలి
పోవుచున్నవి గదా?

గిరి—నేనును నదేచెప్పఁ దలఁచుకొంటిని. వెధవశాకీలన్న శబ్దమింక
మన చెవులఁ బడరాదురా! కిల్లీలకొట్టువాండ్లకు సోడాపావుల
వాండ్లకు యీ వగైరాలందరికిఁ గూడ చులకన. పెద్దపిన్న తార
తమ్యముండదు. ఇదంతయు సరిగాని సురానందా!

గీ. కాలుపైఁగాలువైచి సు ♦ ఖములఁ బడయఁ
దగిన యాస్తినొసంగె నీ ♦ తండ్రి యింక
మేముకనుపింతుమే నీకు ♦ మిత్ర! వన
మెఱువఁబోకుము మమ్ము నీ ♦ మానసమున.

సురా—ఎంతమాటంటివి ! అట్టి గర్వమే నాకున్న యెడల నీకొఱకు వర్తమాన మేటికిఁ బంపుదును.

గిరి—ఇప్పటి మాటగాదురా ముందుమాట. ఈమేజుతో మన స్నేహముకు ముద్దుపెట్టినవేమో యని యంటిని.

సురా—అంత వెన్నటికిని జరుగ నేరదు.

గిరి—ఇందువదన రజస్వలయై రెండేండ్లనుండి నీకొఱకు నిరీక్షించి యున్నది నీవేమో యుద్ధరింతువని.

సురా—అవునవును. ఆముసలిముండ నా కెప్పుడును కనఁబడుచునే యుంటుంది. కనఁబడి నప్పుడెల్ల

గీ. ఏమొ మీచలువ యున్న నా ♦ కేమికొదువ
గలుగదంచు దైవంబును ♦ గొలుచుచుంటి
నెప్పుడో ? ఎప్పుడైన స ♦ రేసుఁడీత్వ
దీయచరణాశ్రితంబె య ♦ ద్ధించుచుందు.

అని నవ్వుచుఁ బలుకుచుఁ బోవుచుండును. ఇంతియగాక నా యిందువదన నిజముగ నిందువదనేనోయి !

గీ. బ్రహ్మ ననుఁగూర్చి కష్టించి ♦ స్వయముగాను
బోతఁబోసిన బంగారు ♦ బొమ్మగాదె
అట్టిబొమ్మను వదలు కో ♦ న్నట్టులైన
బ్రతుక నేటికి మిత్రమా ♦ వసుధపైన.

గిరి—నీమాట సత్యము. కాని యింతవఱకు సురానందా ! వాండ్లకు సరితుగు తిండిగాని సరియగు బట్టగాని లేదుగదా! దానిపెద్ద వాడ్లందఱు నమాయకులు. పూర్వకాలపువాండ్లు. నీమీదగంపంత నాశతోయున్నవా రేమి చేతురో.

సురా—దాని విషయమై నాకంతగాఁ జెప్పనక్కఱలేదు. దానిని గూర్చి నేను వేసుకొనిన ప్లానిది.

శా. మూడంతస్తులమేడ యందున గులో ♦ బుల్ షేప్లు పిక్చర్లు నూ
గాడర్ మోదముగొల్పునయ్యేలలు యో ♦ గ్యంబైహితశ్రేణి పే
కాడర్ నీత్రిక్కురూమ్సు మిత్రమ! సగే ♦ నా ? పైగజల్సాలకై
కూడా కావలెనన్న వాటి నీకుం జే ♦ కూర్చున్ గనన్ రాదొకో.

అక్కడకుం గొంప దరిద్రము వదలును. భుక్తికందునా ? నూరు యెకరములు సుక్షేత్రమైన భూమియున్నదిగదా. పదిపుట్లవసతి దానికి. ఇంక సురానందునిం జేబట్టినపుడా యిందువదనకు గుడ్డలోటేముండును. నగలలోటేముండును.

గిరి—అక్కడకా గొడవ వదలినదిగదా. ఇంక మనగొడవ.

సురా—మన గొడవకేమున్నది గడియ గడియ కొకరిని దేబిరించ నక్కఱలేదు. ఆదరిద్రము వదలిపోయినది.

గిరి—నీవా యిందువదనను జేబట్టి యంతటి భోగంబు లనుభవించుచున్నపుడు—

సురా—ఎందుకురా అనవసరముగా నన్ననియెదవు? నే నంతటి దుర్మార్గుండ నగుదుననియేనా నీ యభిప్రాయము.

గిరి—నీకు నామీఁద ప్రేమవుండవచ్చును. నిన్నాముండ వదలవలదా?

సురా—వదలకేమిచేయుదునులే. దాని గుణములు చాలమంచివిరా ?

గిరి—బాగోగులమాట యిపుడుగాదు ముందుముందు. ఇప్పటి నవీనాచారము ననుసరించి మేడమీఁద నీపేరుతో చలువరాతి పలక వేయింతువా ?

సురా—లేకున్న దానినట్టి మంచిస్థితికిఁ దెచ్చినట్లు మనపేరేముండును?

గిరి—మనము శాశ్వతమటరా ? ఎంతసొమ్ము బెట్టినను మనవారు మనపేరు మనమర్యాద వాండ్లకు లెక్కయా ? రేపు రవంత డబ్బు తక్కువకాఁగానే నడవవోయి యంటారు '

సురా—ఇంతేనా ' నీ తెలివితేటలు. నీవు చెప్పినట్లుగానే నవీనాచారములలోనే శాశ్వతకాలము వుంచుకొనువారు పత్రములు వ్రాయిం

చుకొనుచున్నారు. మనకుఁ గావలసిన షరతులన్నిటితో లంజను బిగించననుకొంటివా? అయినను యివి యన్నియు నెందులకు? దానిగుణము నే నెఱుంగుదును. చదువుకొన్నది. సమస్తముఁ దెలిసినది. నా తోడిదియే లోకంబను విశ్వాసముంచఁగలది. ఒక వేళ నంతదూరము వచ్చుననుకొందము. ఇంత మాత్రమునకే చెడుదుమా? భగవంతుఁడిచ్చిన దింత గలదుగదా! మాకేమియు భయములేదు.

గిరి—ఎందుకో పిలిపించితివి. ఏగిరో గొడవలోఁ బడితిమి.

సురా—ఏదిరో గొడవనకు. మన నాటకమంతయు దానిపై నాధారపడియున్నది.

గిరి—ఉండవచ్చునులే. వాండ్లగొడవ లేనిదే మన వ్యవహారమునకుఁ గావలసిన తినుబండారములు మున్నగునవెవ్వరు సరఫరా చేయుదురు చూఁడు.

గీ. బ్రహ్మగాళ్ళముగద మన ♦ వల్ల నెట్టి
కార్యములు నెరవేరును ♦ గాన నట్టి
పనుల గోప్యంబుగానుంచి ♦ పరువునిల్ప
నుండ వలెఁగా ఏ వారల ♦ యండ మనకు.

సురా—అందులకే గాదటోయి యీ యేడ్పంతయు. కాని వెంటనే మేడపని బ్రారంభించుటకు నేనొక్కందులకు యోచించుచున్నాను. తండ్రిగతించి.

గీ. మాసమైనను కాలేదు ♦ మాననమున
నదురులేకుండ వేశ్యాంగ ♦ నకయి పెద్ద
మేడఁ గట్టించి కులుకుచు ♦ న్నాఁడు వీఁడు
మెచ్చుఁడని యీాన డింపరే ♦ తోడివారు.

గిరి — పోనిమ్ము. కొన్నిదినములు గడచినపిమ్మట నే చూతము. అంత

వఱకుఁ బైరయ్యశాస్త్రిగారి దగ్గఱ బొంటుకూములోనే తిప్పలు పడుచుము.

సుర — ఇంతకు నిన్ను రప్పించినపని సుమనఁగా నేటిసాయంకాలము. బలసాచేసుకొనుటనుగూర్చి నీతో సంప్రదించవలయునని.

గిరి — సంప్రదింపుకుండ గావలయునా దీనికి. ఆఁ ఇఁకకంట్రీసరకునోల కొంతపఱకాగినదన్న మాటయే.

సురా — వెధవ కంట్రీసరకు పేరెత్తకురా' అబ్రాంది సంగతియేవేఱు

ఉ. నేర్పుగఁ జేయఁగాఁబడియు ♦ నిర్మలమ్ము దనరారు చెంతయో
యొంప్పగఁజాలకాలము మ ♦ హాదధియానముఁజేసివచ్చియో
దార్పునఁ బజ్జఁగాంచి భర ♦ తాన్వయమందుయశంబుఁగాంచె ని
దర్పము గల్గునే మఱొక ♦ దానియెడఁగ బరికింపమిత్రమా !

మఱియు.

గీ. కార్కువిప్పనఁ జడుకంపు ♦ గలుగకుండు
నీరు గలుపరు దానిలో ♦ బెకుపోదు !
గంటసేపుంచినంగాని ♦ గాటునంగు !
క్షణములోలేని ఘార్సునో ♦ సంగు బ్రాంది.

అది గాకున్నను మనము బ్రాందిని వాడుటలో బెంటెలుమేలు లక్షణములు గలవు.

గిరి — ఈ సంగతు లన్నియు నాకు నీవు చెప్పవలెనటోయి. శతమారివా సహస్రమారివా అన్నారు. ఎన్ని అయినవి.

సురా — ఏదీ ! ఇప్పుడేవ్పుడేగా.

గిరి — గురుదక్షిణమాట యెత్తితినే యెత్త వేమిరా ?

సురా — నీకు గురుదక్షిణగా నేనేమిచ్చిన నంతసింతువు?

గిరి — నాకేమి యక్కరలేదు గాని ఒక్కటి కోరనా ?

సురా — కోరుకో.

గిరి —నీవు క్రొత్తగాఁ గట్టించు మేడ ప్రక్కగానున్న యింటిలో నుం
డనిచ్చితివా ?

సురా— ఇంతేగదా ' ఇంతటి నుండి దాని కీయవలసిన డబ్బే నెల
కొ నెలనే నిచ్చుచుందును లే.

గిరి—ఆ గొలుసింకను విడిపించుకొనరాదా ? నాకీయవలసిన మొత్త
ముగూడ తీసివారవేస్తే యేదో కాలము గడుపుకుంటూ వుందును.

సురా—అన్నియు వసలించుచునే యుంటిని గా. ఈ మూడువందల
రూపాయలు నీవు తీసుకొని వెళ్ళి యెవరిని వారికి సగము.

గిరి—స్నేహితుఁడనుగదా ! ఆ వెధవగొలుసు నీ కెందులకు. క్రొత్త
గొలుసొకటి చేయించుకొనరాదా ? ఈ మాత్రముగ నీస్నేహి
తుని నీప్రక్క నుండనిమ్ము.

సురా—ఉంచుకోరా ! నీవడుగవలయునా ! మరి నీవు తొందరగా
బోయి యీ జలసామాట మన పాత స్నేహితులకుఁ జెప్పి నాలుగు
గంటలు టంగుమని వినఁబడఁగనే రెప్రెష్ మెంటు రూము కడకు
రమ్మని చెప్పుము.

గిరి—మంచిది. అట్లయిన నేను పోయివచ్చెదను. నీవుకూడ ప్రయ
త్నములో నుండుము.

(నిష్క్రమింతురు.)

---

# సురానంద

## ద్వితీయాంకము.

(రెఫ్రిషిమెంటురూము).

(ప్రవేశము సురానందుఁడు, గిరిమూర్తి, నరసింహము, గణపతిరావు, సుదర్శనుఁడు, బట్లరు- కుర్చీలమీఁద నాసీనులయి)

సురా—వెల్ బట్లర్ క్లబ్ విస్కి టూ బాటిల్సులాక్కురా.

బట్ల—సర్! ఫుల్ బాటిల్సు యివ్వరాదు. అనిమాకుగూలు. అంతా పెగ్సలెక్క.

సురా—రూల్సు మా కెందుకు. లాక్కురావోయంటే. మఱచిపో లేదులే.

బట్ల—ఆల్ రైట్. సోడా లెమ్మన్నారా లైంజూసా?

సురా—లైంజూసే. (అని మనుష్యులను లెక్కించుచు) వన్. టు. త్రి. ఫోర్. ఫైవ్. యస్. ఫైవ్ బాటిల్సు.

బట్ల—యస్. (అని వెళ్ళును).

సుద—మేము నాన్ బ్రాహ్మిన్సు పద్దోయి. దేవుఁడా. మాకు శాస్త్ర.

సురా—నీవేదన్ను నే నెఱుఁగుదునులే. యు వాన్ట్ కరి గిరి.

సుద—ఆఁ. ఆఁ. అదే. నీకు దెలియదూ. నాయనా యీరోజుల్లోనొ మిటి బ్రహ్మగాళ్ళకు దెలియకపోవడమేమిటి?

సురా—మమ్మల్ని తిట్టకురా! పీకె నొక్కుతారు. పూరుకో. నిమ్మదిగా నొక్కటొక్కటే చెప్పవచ్చునని అనుకున్నానులే. నీకన్నా తక్కువతినే గాడిదెవరురా?

గణ—ఆఁ. గిరిమూర్తిగారి దయవల్ల నేటికి మన సురానందుని మేజు దొరికింది.

సర—ఎవరిచలవైతేనేమి, ఇప్పుడెందుకు. నీపేరునకు సరిపడ్డంతారగించు. ఎక్కడైనా ఊనేసె స్తే కొట్టుకునేముంతావాళ్ళము.

సురా- ఇదంతా యెవరిచలువగాదు. పేరయ్యశాస్త్రిగారిచలువ. స్పెన్సరుకంపెనివారి చలువ. ఫ్రించిదొరల చలువ. ఎంత చిత్రంగా అలంకరించారో చూడరా! ఈ ప్లేట్లు, యీకప్పులు, యీస్పూన్సు, అద్దాలబీరువాలు, ఇది స్వర్గంకన్నా మించియుంటుందిరా!

గిరి—రుచిచూపించడము నావంతౌంది గాని దీనిని మెచ్చించడం నావంతవుతుందా?

సురా—మన పెద్దలంతా యీ బ్రాందితాగడంతప్పంటారే. ప్రసవమైనప్పుడు ఆవాళ్ళకిచ్చేదేమిటో. తెల్లదొరలంతా పానంగా తాగేదేమిటో. బ్రాందికాదుగావల్ను.

(బట్లరు తెచ్చియిచ్చును).

సురా—తీయుండాయి కాప్పులు వెల్ మిస్టర్ శాస్త్రి! కేక్ యుప్రిపేర్ కక్రీస్ నా.

బట్ల—మేముల్లా విగ్రహాలమేగాని అందాక మాపెద్దల చలవకలగ లేదుసార్. మా ఏసుదేవునికి మామీద అంతకృప రాలేదు. లేకపోతే యెక్కడవన్నా మతబోధన చేసుకొంటూ వుందును.

సురా—పాలంకొన్నావు!

బట్ల—మీదయ. మీవంటి గొప్పలంకరి కృపవుంటే నాకేమిలోటు?

సురా—నేనన్నది. కూరినార యేమైన సిద్ధపరచగలవా అని.

బట్ల—ఇప్పుడు యిస్సుదొరకడం దుర్ఘటము. చాలా డియర్‌గా వున్నాయండి.

సురా—వెధవ డబ్బును గురించి చూడకు. ఎంతైనాసరే నష్టయిచేయాలి ప్రవేశంటు పొందాలి గాని.

బట్లు—యస్. ఆ రూపీసు యివ్వండి సర్. కనుక్కుంటాను. నాకు
సైం కావలెను.

సురా—ఈలాగా మామొగాన యిన్నిరోజులో గాదో పడవేసి
వెళ్లు నముటుతూ వుంటేగాని మజా లేదు.

బట్లు—బిస్కట్స్ యిస్తాను ఫ్రూట్స్ తెచ్చి యిస్తాను సిగరెట్స్
యిస్తాను. స్నాక్ పేపరిస్తాను. కులాసాగా వుండండి. ఎంతసేపు?

సురా—సరే. అయితే యీ కొంత రూపీసునోటు నీవద్ద వుంచి (అని
యిచ్చును.) వెల్ బట్లర్ ప్రతి రేపన్ను మాత్రం చాలాజాగ్రత్తగా
వుంచాలి సుమా. కాఫీలు తీయండరా!

బట్లు—కాఫీస్ వోర్డర్ చేసి తెచ్చాను గదా. నేను పోదును.
(వెళ్లును)

సురా—కానీయండోయ్. నే నప్పుడు బడితే అప్పుడే తమాషా
ముందు గణపతికియ్యరా.

గిరి—ముందు తాంబూలాలకిగాదా యెందుకు గణపతీ కానీయరా.

(వరుసగా నొక్కొక్కరే కొంత కొంత తాగి సిగరెట్లు
ముట్టించుచున్నారు.)

గణ—ఎన్నాళ్ళకు లభించినదిరా సురానందుని జలసా.

సురా—ఇదంతా ఒక ప్రయోజకత్వమేనా? నాబుద్ధి యెప్పుడు
కూడా వెంట బదిమందిమిత్రుల నుంచుకొని చక్కగా షోకుగా
జలసా చేసుకుంటూ పులరంగ్యలాగ తిరుగుదామనే మీదనే
వుంటుంది జన్మ యెత్తినందుల కెప్పుడును పదిమందికి పెట్టినవాడు
బుద్ధిమంతుడు. లోభిగా వుండి వుండి మానాయన చచ్చిపోయే
నాడేమికట్టుకొనిపోయాడు. సర్వకాల సర్వావస్థలయందు మన
మంతా యిట్లాగే వుండాలెనని కోరికె.

సుద—బట్లరుగారు మనమాట మఱచిపోయినట్లున్నారే. బట్లరుకాస్త
గ్లాసు. ఏదోయి ప్లేట్లు.

బట్లు—రెడీసర్ (అని ప్రవేశించును.)

గణ—డబ్బుగలవాళ్ళెప్పుడూ యిట్లా వుండాలనని అనుకుంటారు. మా కేముంది నీలాంటివాండ్లు పదికాలాలుపాటు బాగుంటే మావంటి వాళ్ళకుఁ గడుపు చల్లఁగా వుంటుంది.

నర—మంచిమాటాడినావురా. నా ఆయుర్దాయము గూడా పోసికొని బ్రదుకు.

గిరి—తెగదంచుతారు కోస్తుకొందుకు లిచ్చేవారుండాలి గాని

నర—నీవే పాపము. దంచ లేనివాఁడవు. నీయమ్మకడుపు చల్లఁగాఁ బాచికపారించావు మనవాణ్ణిదించి.

సురా—ఒరే. ఒకరు దించేదేమిటిరా'

గణ—యేమిటోయ్ యేడ్పు. నాకు నిద్రవస్తూన్నట్లుంది.

నర—తేఱగా వచ్చిందని యమపట్టు పడితే నిద్రరాదురా మఱి.

సురా—నీ దుంపతెగ. తాగడం నిద్రకోసమా! కులాసా కబుర్లు చెప్పుకోవాలి. కాస్త యిటూ అటూ పచార్లు చేయాలి. మనము స్వర్గాల్లో వున్నామనిపించాలి. మద్రాస్ మనస్సెట్టు బయలుదేరిందంటే. ఆడవాళ్లుహడలెత్తిచావాలి...కానీయిండి ప్లేట్లుగుద్దండి.

(అందరు తినుచున్నారు.)

గణ—సురానందులవారి మేడకు కలపా గిలపా వచ్చినట్లుందే.

నర—రాజు తెలుసుకుంటే దెబ్బలకు కొదవా?

సురా—అవునురా! మీరంతా నావెంట వుండి కనిపెట్టుతూ వుండండి. ఎన్నిమేడలు వేయిస్తానో!

నర—వేయిస్తావురా! ఆగర్భశ్రీమంతుడవు నీకేం దీనికేంగాని సరిపెట్టారేం పూజకానీయండి

సురా—ఊఁ (అందఱు మఱలఁ దాగుదురు.)

గిరి—ఈలంజ జాతికి విశ్వాసం ఉండదంటారు.

సురా—మంచి ప్రస్తావమెత్తినావురా. కవులు మూర్ఖులు. ఏటావల వస్తే లేవంటారు. అందటి యందుఁగల దోసము మా యిందు వదనమీఁద ఆరోపిస్తే నాకు కడుపుమంట ఆగదు. దానికాళ్లు కడిగి నీళ్ళునెత్తిని చల్లుకుంటే మన కష్టమేమయినా దానంతటి వాళ్ళమన్న యోగ్యత కలుగుతుందేమో.

సుర—అంతటి దానిని నీవు చేతఁబట్టిన తరువాత దాని కాలినీళ్ళు మాకు గతిగాక యింకేమవుతుంది. తావలచిన రంభ తాను మునిగింది గంగ.

సురా—వెధవ. సామ్యాలు వెక్కిరింపులు గూడను.

నర—మిత్రమా! సురానందా! ఈనాటితో చదువు కట్టిపెట్టినట్లేనా?

సుర—మహారాజు వాడికింకా చదువెందుకు వెధవ చదువు.

సురా—కాకపోతే నాటుటి నవుకరీ చేస్తేనేగాని గడవదా.

(మజిల బట్లరు ప్లేట్లు యిచ్చును. తినుచుందురు.)

గణ—ఇదంతా నేమిటి? కళ్ళుతిరుగుతూవున్నాయి. నేను తిరుగుతూ వున్నాను మీరు తిరుగుతూ వున్నారు. రూముతిరుగుతూ వుంది.

సురా—అన్నీతిరుగుతూ వుంటే యిఁక తిరుగనిదే ముందిరా?

సుర—నాకుగూడ అట్లాగే వుందిరా.

సురా—నాన్ బ్రాహ్మిన్సు మీరేమి నోచుకున్నారు. గర్భపోటులు గొట్టినా ప్లేట్లు యెగరవేసినా జంధ్యాలు బాంబ్లో దోపినా మేం గాని మీరా? గిరిమూర్తిగా! తియ్యరా పేక

బట్ల—దొరలు వస్తారు సర్ యక్స్క్యూజ్ చేయాలి పేకవీలులేదు.

సురా—పోనిలే పోతాముబిల్లు.

బట్ల—సర్, యిస్తాను.

సుర—ఇక్కడినుండి క్యాంపెక్కడికి?

సురా—పోదాం పదండి. ఏ దాసీల కొంపలకో ఏ భోగంవాళ్ల కొంపలకో!

గణ—డబ్బుగలవాడవు వెడుతావు. మాగతెల్లా—

సురా—రండోయి వెధవల్లాలా. తలానాలుగిచ్చుకుంటానులే. మీ [illegible]క్కువ మీ రేడుద్దురుగాని.

గణ—మీరింక భవనములోకి నడుస్తారుగావల్ను.

సురా—ఇక్కడి కింత ఆలస్యమైంది. ఏమంటుందో అని గుండె దడదడా కొట్టుకుంటూ వుంది. కాస్సేపు కనబడకపోయినా హా ప హారా మీ[illegible] హరా! ఏ ఆడది నన్ను పలకరించినా యింక వాళ్ళగతి వుందే. మిత్రులారా! దాని ఆదరణము. (త్రేపి పొట్ట సద్దుకుంటూ) ఫర్వాలేదు. ఆపుకున్నానులే. నాపు మేజి దూజంలో చూచిందా! ఆ ఆనందము. అబ్బా! యింటిలో కాలు పెట్టగానే ,, ప్రియా! రమ్ము. '' అని గట్టిగా కావలించుకుని లోపలికి దీసికొని పోయి వెచ్చటి నీళ్ళ స్నానము చేయించి మల్లు చొక్కా తొడిగించి ఫ్రెంచివిస్కీ గ్లాసులో పోసి యిస్తే దాని మొగం చూసుకుంటూ తాగేవాణ్ని. గుమ్మగా వుండేది. ఇప్పుడు అరగంటకెక్కే కైపు అప్పుడు పావుగంటకే యెక్కేది.

సుర—ఎందులో వుందంటావు ఆతమాషా.

సురా—ఎందులోవుందా! దాని మొహంలోవుంది. చూపుల్లోవుంది. ముక్కులో వుంది. చిరునవ్వులో వుంది. ఆ హొయల్లో వుంది. ఆసోకులో వుంది. ఆకులుకులో వుంది. ఆనడకలో వుంది. నాయానందంలో వుంది.

సుగ—ఈ దండకాని కంతెప్పుడు.

సురా—నిషాదిగిన తరువాత... ఈ వెధవప్రశ్నలన్నీ యెందుకు. తరువాత విను. యింటికిపోతాను అన్నాని కన్నానా! చచ్చానే.

ఇక్కడే భుజించండి అంటుంది. సరేనంటానురా! కూరి కూరి నోట్లో చ్చేటంతగా పెడుతుంది. ఎట్లాగో తింటానా కాస్త ఆయాసం తీర్చుకోనీయదు గదా. తియ్యి పేకంటుంది. తను వోడు వచ్చిందా పరియాచకానికి దిగుతుంది. మరి వోడు కనపడ్డదో పెట్టు డబ్బక్కడ పెట్టు అంటుంది. కాస్త డబ్బులేసి. ఆనక యిస్తాలే అన్నానా! తీయ్, రిస్టువాచ్ అనేదీ లాగేదీ—

సుద—మళ్ళీ యిస్తుందా!

సురా—ఛీ! ఛీ! బోగంది చేతిలోలాక్కుంది మళ్ళీ తీసుకోడానికేమి గాడ్దెననుకున్నావురా!

(బట్లరు బిల్లు తెచ్చియిచ్చును).

సురా—ఎంతఅయింది రు 28-14-0 లా? రు 10-0-0లు పోను రు 18-14-0 సరే రు20-0-0 లు యివిగో మిగతది ప్రెజంటుతీసుకో.

బట్ల—సలాంలుచేస్తాను. దొరలువచ్చే వేళయింది. ఇక మీారు దయచేయవలెను.

సురా—అక్కడదాకా పడకు. వెళ్ళక కూచుంటామా! వుండు. సుదర్శనం! పలుకులు చిలుకపలుకులు. కంఠముకోకిలకంఠము. దానిచూపులకు మన్మథుఁడు పాడెలెత్తి పరువెత్తాడు. దీని మొగంజూచేటప్పటికి చంద్రుఁడి మొగం వెలవెలబోయిందిగావాల్ను వెనక్కుబోయాడు. దానిసరసత. ఆఆదరణ. ఎందుకురా! యజ్ఞాలు యాగాలుచేసి రంభకోసం దేవులాడే వెధవలు తప్పు తప్పు. ఒరే. ఏమిరోయి. మాటలు తూలుతూవున్నాయే. పొరపాటు వచ్చునప్పుడు ఆ అని అదలించవద్దటరా! ఆపడదానిపాట్లు పడే పెద్దమనుష్యులంతా వున్నారే వాళ్ళసౌఖ్యం నాసౌఖ్యంక్రింద యెన్నోవంతు.

గిరి—ఇప్పుడు నామాటలు మీాబుర్రలో ఎక్కేటట్టుగాలేవు.

సురా—ఎక్కకేమివుండరా! ఇప్పుడెక్కినంతవఱకు చాలును. కుమ్మరసారె తిరిగినట్లుగా తిరుగుతూవుంది. ఆకాశము. భూమి. నీవు.

నేను. వాడు. వీడు. అరే' బట్లర్. టేబిల్సు, అలమార్లు, సీసాలు
అన్నీ తిరుగుతూవున్నాయిరా.

గి.—మరి అలా అయితే గతేమిటి. నీకూతిరిగి నాకూతిరిగి అంద
రికి తిరిగితే యిళ్ళకుఁజేరే సూత్రాలెల్లాగంటా ?

సురా—ఒక సూత్రం. భుజాలమీద చేతులేసుకోవడం. బయిలుదేరి
నడవడము.

గి—ఎవళ్ళన్నా యెదురుబడతారా?'

గిరి.—పడితేనేమిరా! వాళ్ళసొమ్ము పెట్టారా! మన సొమ్ము పెట్టి
మనంతాగాం. తందనాలు ఆడుతాం. రోడ్లమీద దొర్లిపుచ్చకా
యల్లాగ దొర్లుతాం వాళ్ళకేమీఅంటు:-

సురా—అంటో గింటో మీయిద్దరూ మీరేడవండి నాదారిని నేను
పోతాను.

సుద—మహారాజువి గనుక—చక్కఁగా మేడగట్టించుకున్నావు గనుక—
బంగారపు బొమ్మను సంపాదించావు గనుక—చక్కఁగా, కవిగా,
షోకుగా, తాతుకుమంటూగా పూలరంగడిలాగ ఆ పందిరిమంచము
మీద ఆ బొమ్మలు చూచుకుంటూ సరదాగా వుంటావు.

సురా—అవునురా! అంతేగాదు. యింకావుంది సరదా. ఆ యిందు
వదనచేత, ఆ కుందరదనచేత, ఆ మందయానచేత, ఆ సుంగ
రాంగిచేత, (త్రేపి) ఆ కదలమారింది. దీని తస్సాగొయ్య.

గి—పొట్ట రాసుకో.

సురా—(నద్దుకొని) ఎక్కడున్నాను.

గి—రైలుస్టేషనులో ప్లాటుఫారంమీద. ఆఁ, ఆఁ, కాదు. కాదు.
రెఫ్రెష్మెంటు రూములో.

సురా—అదిగాదురా! మన సంభాషణెక్కడున్నదన్నానురా? గాడిదా!
అని రాగందీయును.

గణ— సంగీతములోకి దిగింది.

సురా— దిగిందీ? వహ్వా! ఆనందంలో తన్మయత్వముఁ జెందినామన్న మాటే. పరమానందంలో పరిసిపోయినామన్నమాటే, బ్రహ్మానందంలో లీనమైనామన్నమాఁటే. ఇప్పుడు మనము భూమ్యాకాశముల మధ్య యెగోస్టేనులో బడి పోతూవున్నామన్నమాఁట.

గణ— కాదు. తాగుబోతులమై కళ్ళు మూసుకపోయి గబ్బిలముల మైతిమన్నమాట.

సురా— కాదురా! తాగుబోతు లేమిటి! పరబ్రహ్మ స్వరూపమును కనుక్కునే సూత్రం గట్టిగా పట్టుకున్నామన్నమాట.

గణ— వారు గంజాయి దంచుతారురా?

సురా— మనము బ్రాంది దంచుతాము. ఏదైతేనేమి తల దిమ్ముబట్టి ఆనందము కలగడానికి నిశ్చలత్వము కుదరడానికి. మనకుమాత్రము తత్త్వాలురావా? భజనచేయలేమా! అనండి, రమారమణ గోవిందో హరి. (అందఱు నందురు).

బట్లర్— అయ్యా! ఏమిటండి అల్లరి. పెద్దమనుష్యులనుకుంటే. చాలు. దయచేయండి—

సురా— ఏడిశినావుపోవోయి టప్పాన్. కానీయండిరా! ఒక పాతతత్త్వముంది. చెప్పనా! పాడుతారా!

తత్త్వము.

సర్వమెఱిగీ బ్రతకవలెనండీ ♦ మానవులారా!

(అందఱు నందురు).

సురా—చ. నిర్మలంబగు బ్రాందియిదిగో ♦ నిశ్చలత్వముగూర్చిమిమ్మును
ధర్మయుతులుగఁ జేసి నిరతము ♦ దానకర్ణులుగాఁగఁ జేయు॥

(అందఱు పల్లవిఁ బాడుదురు).

సురా—చ. ధైర్యవంతులఁ జేయునుసుమండీ! భాగ్యవంతులారా!

ధైర్యవంతుల జేసి తగుప్రోత్సాహమిచ్చి యనేక సాహస
కార్యములఁజొరఁబెట్టి తానౌదార్యబుద్ధినిజూపుదీని॥ మ॥

సుద—(పాటకు అడుగు వేయుచుఁదూలి టేబిలుమీఁదనున్న సీసాలు పగులఁగొట్టును.

బట్లర్—(కోపముతో సుదర్శనుని తెక్కువుచ్చుకొని యావల కీడ్చిపా ఱవేయును.

గిరి—అగో ఫూల్! మనుష్యునిముట్టుకొమని యూలేదురా! సీసాలు పోతే డబ్బుతీసుకో.

బట్లర్—మాటలు చిన్నఁగా రానీయండి. డబ్బిస్తే సీసాలువస్తాయా? స్విస్సువారు పంపించాలిగదా!

సురా—ఏమిటోయి వచ్చినప్పటినుంచి వెళ్ళండి వెళ్ళండి అంటూ గోడిపిస్తున్నావు. కావాలం టెడబ్బుతీసుకో. డామేజెస్ భరిస్తాము. మేమేమి ఫూల్సుమనుకున్నావా? తాగినవాండ్లల్లరిచేయరా! మేము మాపనిచేసుకోవడంతోనే నిన్నాబాటిల్సుతీయవద్దన్నారా? కాస్టెంతవుతుందో చెప్పు. తీసుకో! దొరలల్లరిచేస్తే నోరు మూసుకుంటారాలేదా?

బట్ల—సర్. ఎందుకుమాకు వాదమువద్దు. డ్యామేజెస్ రెండి యిరవై రూపాయిలు.

సురా—ఇంతేగదా? భాగ్యము. తీసుకో (అని యిచ్చును.)

బట్లర్—(తీసుకుని) యికఁ దయచేయండి మాట తక్కదు.

సురా—పోక కూర్చుంటామా! మాకు పనులు లేవనుకున్నావా? రండర్రా! ఇగంతా పెద్దగొడవగా వుంది.

గిరి—మొత్తం రు 50—0—0 ల అయిందిరా!

సురా—ఎంతో అయింది రండి. వారు కొప్పడుతారు నాకూ నిద్ర వస్తూవున్నది.

గిరి—మీకు మమ్మన్ని వదిలి దయచేయడమేనా!

సురా—మూడు రోజులనుండి పెళ్ళిగోడవగా వుందోయి. యీ జల నాల సరదాలో అక్కడా యిక్కడా తిరుగుతూ వుంటే యింటి కాడ పెళ్ళాంగోల. అక్కడ ఆముండగోల

గిరి—అడగడం మఱచినాను. పెళ్ళాం వూరుకుంటూ వుందిరా ?

సురా—వెల్. బట్లర్. ముందు నీవీ రెండు రూపాయలు తీసుకొని కాస్సేపు కూర్చో. పదిహేను మినిట్స్ వుయిల్ బి ఆన్ (అని యిచ్చును.)

బట్లర్—(పుచ్చుకొని ఊరకుండును.)

సురా—ఏమిటోయి గిరీ! నీ ప్రశ్న పెళ్ళాం వూరుకుందా అంటావా? చచ్చునాగమ్మనా— వెర్రిదమ్మనా. పిచ్చిపుల్లాయినా! మగ పురుషుఁడుగా సర మానవులలోఁబుట్టి ఆమాత్ర మాడుదానిని లొంగఁదీయలేక పోతానను కున్నావా! పెత్తనం నెత్తిని వేసు కొని నీ యెడమచేయి తీయి నాపుర్రచేయి పెడుతానన్నట్లు వస్తా నుగాని చెప్పకింద తేలువలె, మదించిన యేనుగుకు అంకుశము వలె పాడుస్తూ లోకులఁజూపించకుండా వుంచాలిగాని పెళ్ళాం మీద జాలిదలిచామా నెత్తికెక్కి మొత్తరంటావా? అబ్బా కొన్నిచోట్ల వున్నారు నాయనా! మగవాళ్ళను వెధవల్ని చేసి కూర్చోపెట్టారు గందా.

గణ—మరీ గోడ్పించకోయ్.

సురా—ఛీ! ఛీ! కటికవాడినను కొన్నావా! నాకేమరుమాట చెప్పు దుగా. అల్లాగే వున్నట్టయితే పక్కటెముకలు విరుగదన్న నను కొన్నావా? నేను యింటికి వెళ్ళేటప్పటికి యెదురుగా వచ్చి డ్రెస్సంతా అందిపుచ్చుకొని వేనీళ్లుతోడి వెండిపళ్ళెంలో అన్నం గిన్నం పెట్టి రెడీగా వుంచవలసిందన్న మాటే.

గిరి—మఱీ మేమంతా పోవలయునన్నమాటే!

సురా—(గిరితో రహస్యముగా) ఈ మూకను దోలివేసి మనం పోదామ్. నరసింహం! నువ్వూ సుదర్శనం గణపతి ముగ్గురు నడుస్తూవుండండరా! గిరితో కబురు చెప్పి పంపిస్తాను.

(ముగ్గురు వెళ్ళుదురు.

గిరి—పీడ వదిలిందిరా! మనము పోదామా యిక.

సురా—పోదాంగాని నేనేదో దానితో కూడా పడివుంటాను. నీవు వారికే పడివుండడం నాకు మర్యాదగానుండదయ్యె. ఏలాగురా భగవంతుడా! అని ఆలోచిస్తూ వున్నాను.

గిరి—నాకేంగాని మఠం యింటికి పోవడ మెప్పుడు?

సురా—నేను వస్తువస్తాను. లేకపోతే లేదు. ఒక్క పనిమాత్రం చేసిపెట్టు.

గిరి—ఏందో చెప్పు. వద.

సురా—నేను [illegible] వెళ్ళానని నేను రాత్రిదాకా రానన్నానని మా యింటి వద్ద చెప్పు,

గిరి—అందాకా అక్కడేనా మకాం.

సురా—అక్కడే. ఎందుకంటావా? మూడు రోజులనుండి నాగా.

గిరి—నేను కూడా అందాకా అ ప్రక్కనున్న లేమ్చావు దాని కొంపలో పడివుంటా! సర్ది చెప్పి త్వరగా రారాదూ?

సురా—వాడు చూచాడంటే విరగదన్నుతాడు,

గిరి—ఏడ్చాడుగాని నాలుగు రూపాయలు యిట్లా పారెయ్. నా మొద్దు నే నేడుస్తాను.

సురా—సరే. యిందా. తీసుకో. గొడవ. ముందు యిక్కడ నుంచి మనము వదిల్తే పిల్లగారి గోల వదుల్తుంది.

(నిష్క్రమింతురు.)

---

శ్రీ

# సురానంద.

## తృతీయాంకము.

ఇందువదన గృహము.

(ప్రవేశము:- ఇందువదన)

ఇం—(స్వగతము) మా అమ్మ నన్నింతవరకు నిలిపి యుంచినందులకుఁ గోరికలు సిద్ధించినవి. పెద్దవాండ్ల మాట తీసివేయరాదు. "ఏపుట్టలో నేమిపామున్నదో అమ్మాయీ' యింటికి కలప నడిగితివా యింతయిల్లు వేయించుకుందా మన్నది." అడిగిన వేళా విశేషమున మూఁడంతస్థులమేడ పడ్డది. పైగా పెద్దలు చేసి యుంచిన ఋణము వేయిహూవాయిలు తీఱిపోయింది. ఇన్ని వస్తువులు, ఇన్నికోర్కెలు అమరినవి. కాని పంతులుగారు బ్రాందిసీసా తెగఁజేయడం మొదలు పెట్టిననాటనుండి రొక్కస్థితి వదలడమే గాకుండా భూమికూడా తరిగిపోతూ వున్నది. దీపముండఁగానే వెదకుకోనుమని యింత భూమికూడా పంతులువారి పేరుమీఁద సంపాదించితినా కులస్థుల నందరిని బలాదూరు తీయవచ్చును. ఏమేమో శ్రీరంగనీతులు చెప్పెదరుగాని మా మాయలలోఁ బడని వారు లేరని మా పెద్దలు చెప్పె సంగతులన్నియు వాస్తవములే.

సీ. పురుషులమని గర్వ • మున విఱ్ఱవిగెదరు
వారి గర్వమడంచు • వారకాంత
ముడిఁగట్టినాము లోఁ • బడుదుమే మేమను
వారి లొంగఁగఁదీయు • వారకాంత

కోటీశ్వరుల నేనిఁ ♦ బూటకూటికి లేని
వారిఁగా నొనరించు ♦ వారకాంత
లోభినేని క్షణంబు ♦ లోఁ గరగించుచు
వారివి త్రముఁ జూఱు ♦ వారకాంత
గీ. వారకాంతలఁ జూచుటే ♦ పాపమనఁడు
వారి వాల్యాపునకె గట్టు ♦ వారకాంత!
అట్టి వారకాంతల మాయ ♦ లందుఁ బడిలి!
జోగులై పోని వారలె ♦ చ్చోటఁ గలరు?

మూఁడు దినంబుల నుండియుఁ బంతులుగారి పత్తాలేకుండ యున్నది. ఎచట తాండవమాడుచున్నారో? ఎవరు నాలుగు తాపులు తగిలించిరో?

ఆ-వె. తాగిచక్కా రాకఁ ♦ గండనా లాడుచు
వారివీరితోడ ♦ వాదులాడి
చివఱకింత శాస్తి ♦ చేయించుకొనుదాక
నింటిమొగముఁ జూడ ♦ రిట్టివారు,

నేనును మాయమ్మయుఁగూడ యిల్లు యెందుకు చెప్పు అయి పోతే పట్టేవా రెవరును లేరు. ఈ విధముగా తిరిగితే రాజాధిరాజు లంటివాళ్లు క్షౌరమైపోయినారు మన మెంతని యెన్నివిధాలఁ జెప్పినా ప్రయోజనముకనబడ లేదు పోనిమ్ము. నాకేమి? ఏమోయంచి దారిలో వుంటే నాలుగు రోజులుంచు దాని చూచితినిగాని మొగమోటము పెట్టుకొన్న ప్రయోజనము లేదు. ఈయన క్షౌరమైన నాకేమి!

(తెరలో తలుపు చప్పుడు)

వచ్చుచున్నట్లు లున్నయది. ఈనాఁడు పంతులు వారినిబుట్టలో పెట్టేపద్ధతి చూడాలి.

సురా—(ప్రవేశించి) వెలఁదిఇందువదనా' ముస్తాబు బాగుగా కుదిరినది కాదేమి! ఎగాదిగా చూచుకొంటూ వున్నావు.

ఇందు—(విన్నమోమున) మామున్నాబెంత ? మేమెంత ? కానీయండి పంతులు వారికిల్లు యిప్పటికైనఁ గనపడ్డదే.

సురా—స్నేహితుల జలసాల్లోమునిఁగి తేల్తూవున్నాను చిపాట్లు పెట్టకోయ్.

ఇందు—బల్నాల హాలావృష్టిలో స్నేహితులంతాచేరి కొత్తసానిని తగిలించ లేదుగదా.

సురా—అబ్బే ఒకవేళ వాళ్లిలాగిలిస్తే మాత్రం నేను తెలివితూలిన వాఁడినా ? నిజిజా తేడనుకొన్నావా ఏమిటి ? సరేగాని యీ వేళ నీ వేమో విపరీతముగా నున్నట్లున్నావే.

ఇందు—నేనా ! ఒకప్పుడు మీకు సరసంగా గనబడుతూ వున్నాను గనుక యిప్పుడు విపరీతమంటారా ! ఎప్పుడూ నా బ్రతుకు నవ్వులపాలుగానే వుండెను.

సురా—అదేమి? తాటియాకుల యింటిని మేడగామార్చితిని. వసువులు మంచాలు బొమ్మలు ఉయ్యాలలు అత్తరుదానులు రకరకాల కోకలు వొంటినిండా నగలు యింటినిండా తినుబండారాలు లోప మేమి లేకుండా యిన్ని అమర్చితిని గదా ! నీ బ్రతుకు నవ్వులపాలెందుకుఁ గావలసి వచ్చింది.

ఇందు—ఇన్ని యమర్చినను మీబుద్ధిమారనందుకు నవ్వుచున్నారు.

సురా—అదిగాదే. వద్దురామీముండా మొయ్యాలంటే వెంటపడుతారు. నేనుతాగనురామొట్టో అంటే పడదీసి నోట్లోపోస్తారు. మీతో రానురా అంటే పట్టుకొని లాక్కుపోతారు. ఎట్లాగేదవను వీళ్ళతో. నేనైతే జాగ్రత్తగావుందామనేవుంది గాని బుద్ధి మధ్య మధ్య గడ్డితింటూవుంటుంది.

ఇందు—పోనీయండి. నాకేమి. మీబాగుకోరినదానను గనుక చెప్పెదను. మీకొక్క మంచి సలహాచెప్పెదను చేస్తారా ?

సురా — నీవేమిచేయమంటె నేనుచేయలేనో చెప్పు. చేతిలో యీసెజ రుసిగ రెట్టువుందిగదా. ఈ యగ్నిహోత్రంసాక్షిగా చెప్పుచున్నాను విను. నీవు గంగలోదిగరా అను. నేను దిగకపోతే మూతిమీద చెప్పు.

ఇందు — మీరిట్లాగ తిరుగుతూవున్నారా ? మీపొలంఅంతా క్షౌరము. తరువాత చిప్పా, కట్ట పుచ్చుకుని అయ్యాబువ్వ. అయ్యాబువ్వఅని తిరిగేగతి పడుతుంది. అప్పుడు స్నేహితులుపెట్టరు. బంధువులు పెట్టరు. తెలిసిందా ?

సురా — నీవైనా పెట్టకపోతావా ?

ఇందు — తాటాకులుగావాల్ను. మేమెల్లా పెడుతాము లెండి. శాస్త్ర విశ్వాసముండి పెట్టినా మీపేరుమీదుగాయిచ్చిన యీనాలుగూ క్షౌరమవ్వేదాకా పెడుతాను. తరువాత మీవెనుక నేనుకూడా బయలుదేరవలసిందేగా. అయ్యో ! యింతపొలముంది. దాని మీద యీ అయివజువస్తుంది. పెట్టుదాం అని చాలివేయడాని కైనా పొలాలు తాకట్టుపెట్టుకోవడమేమో పదిమందిని చేర్చుకో వడమేమో తప్పతాగి తందనాలాడడమేమో? అంతేగా! సాగను.

సురా — అదిగాదు. నాకొక పద్ధతితోస్తూవున్నదే. ఇదుగో నాపొలం అంతా నీ పేర వ్రాసియిస్తాను, దానిమీదవచ్చే డబ్బుతో కాల క్షేపముచేద్దాము. నీయిష్టములేనిదేకాని ఖర్చుపెట్టను. అట్లాచేస్తి నా తల్లికి మొగుడు. సరేనా !

ఇందు — మాపేర ఎందుకువ్రాస్తారు లెండి. మాది నీతిజాతిలేనికులము, విశ్వాసములేని ముండలము.

సురా — ఎవరన్నారు నిన్నంత మాట. నీబుద్ధి విచారించకుండానే నీయింట్లో కాలుపెట్టితి ననుకొన్నావా యేమి ? చదువుకున్న దానవు. తెలివిగలదానవు. నీప్రాణమే నాచేతిలో పెట్టినదానవు.

నాకే లోటుపాటు లేకుండా ఆదరిస్తూ వున్నదానవు. అట్టి నీయందు నాకు నమ్మకము లేకపోతే యింకా నాకు లోకమేముంది?

ఇందు— ఎందుకు వచ్చిన కభుర్లు. ముఖప్రీతి మాటలు నాకు నచ్చవు సుమండి.

సురా— నావి ముఖప్రీతి మాటలా? ఇన్నాళ్లనుంచి నాతో స్నేహము జేసి నీవు గ్రహించిన దింతవరకన్నమాట. నీపై భ్రాంతి చెందుటచేత— నీ సౌందర్యం గోరని వాని జన్మ మెందుకని దలంచుటచేత, నీ రూపరేఖలను జూచినప్పుడల్లా ప్రపంచమే మరచి తన్మయత్వంబు జెందుచున్న వాడనగుటచేత. వేయిమంది వేయి విధాలుగా చెవులు పెట్టినప్పటికి వాటి నన్నిటిని త్రోసి రాజని నీ యడుగులకు మడుగులొత్తుతూ నీ గీత దాటకుండా నీ వేది కోరిన నది యప్పుడని యెప్పుడని వాయిదాలు వేయకుండా తక్షణం చేస్తూవచ్చిన ముండావాడని నన్నుపట్టుకుని యింతమాట అనడం న్యాయమేనా? త్రాగడం ద్రాగడం అంటె దాని మజా నీకు తెలియకపోవడంచేత అల్లా అంటావు. నేను చెడిపోతానా? ఎన్ని సారాలు వాడినా తరగని ఆదా వచ్చే పొలాలు వున్నాయి గందా!

ఇందు— మీరు చెప్పినట్లుగా తాగినా తందనాలాడినా ఆ కాస్త నా పేరను వుంటే మీసిగలో పువ్వు తీసేవారున్నారా?

సురా— నీ ఆలోచనకు ముందుగానే నేనంటినిగా వెనుకకులాగను. నా పొలం నీయిష్టప్రకారం నీపేర వ్రాయించుకో. నాకు నాసంసారానిక, నీకు నీ సంసారానికి గూడా నీవే పెత్తనం చెయ్యి. నీవు పెట్టినాడు తింటాను. పడుకోమంటే పడుకుంటాను.

ఇందు— అంతమాత్రం నమ్మకం నాయందుంచి వ్రాయండి. నేను మిమ్ముల నేదశలో వుంచుదునో చూచుకోండి.

సురా—మళ్ళీ నమ్మకమని యనకు. నీ పెత్తనంలో నే నున్నానంటే నా కేమి లోటు రాదు. బాగుపడ్డానన్నమాటే. ఒక్క సంగతి అడుగుతా. కోపము రాదుగదా!

ఇందు—నా కెందుకు కోపము!

సురా—మొన్న రాత్రి యలమారులో నుంచిన బ్రాందిసీసా వున్నదా. మీ తమ్ముడు పీల్చివేశాడా?

ఇందు—అదెక్కడికి పోవును? తెమ్మనరా.

సురా—తెమ్మనెదరా యేమిటి వచ్చిదానా! రాత్రి తలదిమ్మ యిప్పటివరకు వదలలేదు.

ఇందు—కానీయుండు పుత్త్రైనుపుట్టిన బుద్ధి పుల్లలతో గాని పోదు.

సురా—చివాట్లు పెట్టకోయి. ఇకనుంచి నీ యిష్టమువస్తే తాగినట్టు లేకపోతే లేనట్లు. ఇప్పుడైనను నీవు సంతోషముగా యిస్తే పుచ్చుకుంటాను. లేదా లేదు.

ఇందు—నా కెందుకు విచారము. మీసొమ్ము మీరు ఖర్చుపెట్టుకుంటారు. నా ముల్లె యిస్తువున్నానా?

సురా—అదే వద్దన్నది. నీనా అనేమాట మానమంటే మానవు గందా!

ఇందు—పోసియుండి అంతా. సీసా తెచ్చియిస్తా వుండండి.

సురా—త్వరగారా పో—

ఇందు—(వెళ్ళెను.)

సురా—పిచ్చిముండ కభిమానము ఎక్కువే. కాస్త పేడిపించాలని యిట్లా చేస్తుంటుంది. ఈ వ్యవహారంలో పదిమంది వెంట వుంటారని, యెటువంటి కార్యానికైనా చొరవ పుట్టిస్తుందని, అగ్నిహోత్రుడు గంగాభవాని మీదికి వచ్చినప్పటికి ధైర్యముగా యెదుర్కోడానికి శౌర్యం యిస్తుందని. యీ పదార్థంతో

యెంతలెంతవాళ్ళను కట్టివేయడానికి వీలుంటుందని యిందులో
యింత గొడవవుంటుందని యెంత చెప్పినా వినదు. చిత్తము మీద
నన్ను బాగుచేయాలనే వుద్దేశము. ఉన్న భూమి శాస్త్ర దీని పేరుతో
వుంచానా అప్పులాళ్ళ సంగతి గోవిందా. వాళ్ళతోట్లో మన్నే.
వెధవల నప్పుగూడా అడగాలి. తిండికి పదిపుట్లు గింజ లుంచుకున్న
నల్భై పుట్లు శుభ్రముగా రోజూ జలపాలు చేసుకున్నా యిబ్బంది
వుండదు. (అటూ నిటూ చూచి) వస్తూవున్నది. ముందను దీనినిగూడా
ముంచాలి. అప్పుడుగాని దీని మజా తెలియదు.

ఇందు—(పరివేషించి) ఇంకొండి పంతులుగారు. గ్లాసులో పోయనా?

సురా—ఊ.

ఇందు—(పోసి యివ్వగా)

సురా—ఇవ్వాళయినా నాముచ్చట తీర్చుదూ'

ఇందు—మీ కేమండి మహారాజులు ఈ రాజ్యిస్తారు రేపిస్తారు తరువాత
యిచ్చేవా రెవరు?

సురా—ఇస్. అబ్బా' తెలవొప్ప మాటలు. నామాటవినక పోతివా
నామీద ఒట్టు

ఇందు—(తనలో) ఇప్పుడీతని మాటవినక పోతినా మన వ్యవహారము
నెరవేరునట్లు లేదు. కనుక వినుటయే యుక్తముగ దోచుచున్నది.
నేనును పుచ్చుకుంటాను.

సురా—నట్టిమాటలు. నామీద ఒట్టేనా?

ఇందు—ఒట్టే

సురా—చేతిలో చేయి వేయి

ఇందు—(అట్లే నవ్వును)

సురా—(గ్లాసులోనిది పుచ్చుకొని మరల గ్లాసులో బ్రాంది పోసి
యిచ్చును.)

ఇందు—(పుచ్చుకొనును)

సురా—ఇప్పుడు నాజన్మ ధన్యమైనది. నా కులంపావనమైంది. తల దిమ్ము దానంతటనదే వదిలి పోయినట్లున్నది. మామూలు గానే యెదిరిస్తావను కున్నానుగాని నన్ను సెహబాస్ అనిపించావు. ఏదీ! ఒకముద్దు పెట్టు.

ఇందు—ఎప్పుడూ అదేపనిమీకు. ముద్దులకేమిగాని ఫలహారమేమైన తేవద్దూ.

సురా—లొక్కు గా మరి.

ఇందు—(వెళ్లుచు) మీరీకుర్చీమీదనే కూర్చుండండి. లోపలకు వస్తాను

సురా—ఆముండ కొంచెముగూడ కొట్టుకురా. ఎక్కడున్నాదో జూచి.

ఇందు—ఆలాగే (వెళ్లును)

సురా—దీనిని తెలియని మూర్ఖులంతా దోషమంటారు.

శ్లో॥ పీత్వాపీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే।
పునరుత్థాయ వై పీత్వా పునర్జన్మ న విద్యతే॥

చదువుకొన్న ముండా వాడిని ఇంతమాత్రం తెలుసుకోకుండానే యిందులో దిగానుకున్నారు కాబోలు. బాగాకడుపునిండా స్పృహ లేకుండా పడిపోయేటట్టుగా తాగమన్నారు. తెలివి కల్గిన తరువాత మళ్లీ తాగమన్నారు. అట్టివాడికి పునర్జన్మ లేదన్నారు.

మద్యం మాంసంచ మీనంచ ముద్రామైధునమేవచా
ఏతేపంచమకారాస్స్యుర్మోక్షదాహియుగేయుగే.

మద్యము, మాంసము, మత్స్యములు, ముద్ర మైథునము యీ పంచమకారములను ధరించు వారికి తప్పక మోక్షం వస్తుందన్నారు. ఇవి పూర్వులు చెప్పినవి కావా? శ్లోకములు గావా? అర్థము రావడం లేదా? మనస్సునకేది సంతోషమిస్తుందో దానిని ఆచరించ డానికి వీళ్ల ఆభ్యంతరమా? వీళ్లె తాతలడ్డంవస్తారా! ఇట్లాగే రోడ్డు

సురా...నీ యక్క.

రాము—అక్కా! రావేమే. బావగారికి డాకలోది అడుగూబొడుగూ తుడిచి యేమైన పెట్టావా! బావగారూ! ఈ సిల్కు కొత్తగావుంది. ఎప్పుడుకొన్నారు?

సురా—నిన్న నేరా! నీకళ్లుబడ్డాయి! యింకెందుకు. తీసుకో.

(అని యిచ్చును).

రాము—(తీసుకొని) మీకేమండి మహారాజుబిడ్డలు. పెట్టిపుట్టారు.

సురా—అగంతా మెందుకురా! రాజవుతాను. మహారాజవుతాను. పకీరునవుతాను. చస్తాను.

రాము—చావటమెందుకండి. మీరు నాలుగుకాలాలుపాటు వుంటేనే మాకింతఆధారము.

సురా—టక్కరులొత్తుకోడుకా! మీఅక్కయ్యను చంపిపుట్టావురా! సరేగానిశావా! యిప్పుడెట్లావున్నదురా?

రాము—మాబావగారల్లేనే వున్నారు.

సురా—నీ అక్క మొగుణ్ణల్లే లేను?

రాము...గడియారమిస్తాను. గడియారమిస్తాను. యిదుగో అదుగో అనడమేగాని యేదీ?

సురా—గడియారమిస్తే కోకేదీ!

రాము—అదిచ్చినవారిదివ్వరాయేమిటి? మీరు తొడుక్కున్నకోటు కొట్టిందిగాయివ్వరాదూ? చిరిగినకోటుతొడుక్కోవడమేమిటి?

సురా—(యిచ్చును).

రాము—సెబాస్. ఇప్పుడుబాగుందండి. మీప్రక్కనుంచున్నా మీరు ఎవరువీరంటే నాబావమరదని చెప్పుకున్నా ఆ అంగచందాలు యిప్పుడుగాని.

సురా—సీసాలో నేమైనవుంచావా? అంతా పొట్టపోబోశావా!

రాము — అంతేనా ? మీకు లేకుండా తాగడమే ? యిదుగో దంచండి.
(అని సీసాయిచ్చును).

సురా—(సీసాయెత్తి తాగును).

రాము— గ్లాసూగీనూ గీ మీఅక్కఅలేకుండానేనా ?

సురా—మాకదంతా నైజాంతా. బాగుందితాగితే సీసాతోనే. కల్లు తాగితే లొట్టితోనే. మాకు ముక్కువిరుపులు. మూతివిరుపులు, వుమ్మివెయ్యడము యీపిచ్చివేషా లేమీలేవు.

రాము—మీపొట్టలు మహాపెద్దవండి.

సురా—మీఅప్ప అదేపోకపోయిందే ?

రాము—(అటునిటుఁజూచి) అదుగో ! వస్తూవుంగనే గాఁజరాపమతా రేంబావగారూ ! మీ పెద్దరింతగడించి యిచ్చారు గనుక చిత్తుగా రోజూ పుచ్చుకుంటారు. మాకెల్లా చెప్పండి. మీ ధర్మమా అంటూ యివ్వాళ కోటూ గడియారము, సిల్కు దొరకినాయి గదా. భలే బావగారండి మీరు ! మీవంటి వారు చస్తే దొరుకుతారా ? ప్రపంచకములో యెందరినో సరసులను చూచా గాని మీవంటివారు మళ్లీ పుట్టరండి ! ఒక్క నాకొడుకూ—

సురా —అందరిని చుట్టచుట్టి దంచుతున్నావేమిరా ?

రాము—సాగ్రముండావాళ్లీం. తాగుడు తాగకులం మాది. అచ్చ రంముక్క రాదయ్యే. ఇదంతా అల్లా పెట్టండి. మీ ధర్మమా అంటూ నాలుగు ముక్కలిచ్చారుగదా. తూలుమాట లేమైనా వస్తే క్షమించుకోకపోతే యెట్లా.

సురా—ఒరేయి బావా ? అకోటు తొడుక్కొని గడియారం పెట్టు కొని సిల్కుకండువా బుజాన వేసుకొని బయలుదేరావా అంటే,

రాము—సురానందములవారి బావమరిదినంటారు.

సురా—ఛీ ! వెధవ ! దానిలెమ్ముండన్లే వున్నావంటారు.

రాము— ఇంతేగండా! దురుసు రావడంలేదుగదా! బ్రాందిమహత్తు చెప్పనెక్కుతుందండీ.

సురా—నాకంత దురుసు లేదురా?

రాము—ఎంత తాగినారని? పట్టుమని అరబుడ్డి లేదయ్యె. నేనంటే ఏకదమ్మున పిల్చేస్తిని;

సురా—ఏదీ సీసా యెత్తిచూదాం. (రాముడెత్తగాజూచి) ఓస్ యింతేనా. పొయ్యి గ్లాసులో. (పోయఁగాఁ ద్రాగి) మీ అక్కగారింకాఁ యఁ చేయలేదేమోయి.

రాము—వస్తోందండి. అక్కా! రావేమే!

ఇందు— (ప్రవేశము పిగ్గ పళ్ళెముతో) పంతులుగారు! ఆరగించండి.

సురా—(పీనడం మొదలు పెట్టుచు) ఓ! దానికేం. మహదానందభరితుఁడనై నీ బుగ్గలవంక, నీమూతివంక, నీముక్కువంక, నీకళ్ల వంక, నీపాదాలవంక, రాముడువంక, నీవంక, నావంక, సీసా వంక వోరకంటితో చూస్తూ చంకలెగఁబేసుకుంటూ, గొట్టలేసుకుంటూ, కమ్మకమ్మగా పుల్లపుల్లగా మల్లీ యీ పళ్లెం మీదా తారానిస్తానా.

రాము—బావగారూ! అపని మాత్రం చేయకండి. పళ్లెం మీరు తినేస్తే కరువుకాలంలో కొనుక్కోలేము.

సురా—మనోహరీ! నీవు నా ప్రక్కలేనిదే అదియెంత రుచిగానున్నప్పటికి నాకు చప్పఁగానే వుంటుంది నీవుకూడా. నాతోపాటు—

ఇందు—వీటికేమి లెండి

సురా—అంటే.

ఇందు—అంటే మరేమీలేదు. బ్రాందిసీల్లు ముడుసుముక్కలు యేమహారాజు నడిగినా యిస్తారుగండా. దీనికేమిగాని మన మనుకున్న వ్యవహారం—

సురా—ఏ వ్యవహారము.

ఇందు—మరచిపోయాను. ఇదిగో యిదే యిందులోని మహత్తు. నా నాప్రసంగములలోనికి దింపి అసలు వ్యవహారమును పాడుచేస్తుంది భామిని నాపేర.

సురా—ఓ! యిదా. అన్నమాటకు వెనక్కు తీస్తానను కున్నావా? నీవు గీసినగీత దాటితే నీయెడమ కాలిచెప్పు నామెడలో కట్టు సరేనా?

ఇందు—ఈలాంటి మాటలు సాధారణముగా మనలాంటివాళ్లు మీలాంటి సమయాల్లో అంటూవుండేవే నండి క్రొత్తవిగావు.

సురా—ఇప్పుడు నేను తాగిమాట్లాడు చున్నాననేనా! నావి తాగుబోతుమాటలు చేశావుగా! చెప్పు చెప్పు యిదుగో, ఈసురానందుడు, ఈ నీప్రియుడు. ఈ నీ మోహనాకారుడు. ఈ నీమనోహరుడు యింకా చెప్పనా? సుందరీ! తూలుగా మాట్లాడుతూ వున్నానా? చూచుకో ఈనీ సేవకుడు నీయాజ్ఞలను నీ మనవులను, నీవిన్నపములను, నీ మాటలను, నీ యాటలను నీపాటలను యీ బొమ్మలు, మంచాలు, పరుపులు, తలుపులు, కిటికీలు, యీ గోడలు, బావరాముడు యిదంతా యెందుకు? యీ సీసా సాక్షిగా, యీ కూరపళ్ళెం సాక్షిగా, నాగాయత్రీతోడుగా, మీ యమ్మతోడుగా, శిరసావహించి ఆనందపూర్వకముగా, ఆహ్లాదపూర్వకముగా, మనస్ఫూర్తిగా. నీ పాదాలసాక్షిగా (అని పాదములు పట్టుకొనబోయి క్రిందపడి లేచి) ఊఁ! కాస్తపట్టుకుంది.

రాము—(నవ్వుచు చప్పట్లుకొట్టి) బావగారు పరమానందభరితులై శివాలాడుచు నాడవాళ్ళ కాళ్ళమీద బడుచున్నారు. వరేవా! మీరేమిమగవాళ్ళండీ.

సురా—నేనురా వెధవా! ఆడస్త్రీల కాళ్ళుపట్టుకునే వాణ్ణిగాను. నా ప్రేమంపురాసి యని- నాసుగుణాలవాల యని- నావరహాల

కుప్పని- నాకనకంపు విగ్రహాంబని- నామనోహారిణి యని-నా
బహిఃప్రాణమని అనుకొని అట్లా చేశాంగాని నరమానవ జన్మం
బడసి మగపురుష వీరపరాక్రమ సాహసధైర్య స్థైర్య శౌర్యము
లుగల కేసరి సింహమునని పేరు పొందిన నేనేమిటి! అంత అ
ప్రాచ్యపు పనిచేయడమేమిటి సుందరీ! తరువాత ఆఁ దృష్టివచ్చిం
ది. పోలం నీపేరవుంచితే బాగావుంటుందన్నావు. వొద్దు యింతే
గందా? నీవే నేను! నేనే నీవు. నా యిల్లు నీది, పొలం నీది, నా
భార్యనీది యింకా యింకా అంతా నీవ్వూ నేను.

ఇందు—పంతులు గారి ధోరణి బహురసైకలోనికి దిగుతూవుంది.

సురా—నిజమేనా?

రాము—మొత్తం మీాకు బావగారికి రెండు ప్రాణాలు యెక్కువే అయి
నట్లుగా వుంది.

సురా—నిజమేరా! వాసనబాగా దంచుతోంది గంధమా వా యేమిటిరా?

రాము—కభుర్లు నందడిని కూరంతా వుఫ్ అని వూదేశాగే?

సురా—పోరా! నీతో నాకేమిటి సుందరీ! మంచి తాంబూలం పట్టు
కురా? కాస్తసిస్పిడ్ తగ్గిద్దాం

ఇందు—తాంబూలం తయారుచేసి యెంత సేపయింది (అని యిచ్చి)
ఎప్పుడూ మీా యానందం మీా షోకు మీా స్నేహితులు మీా
భాగవతాలు యింతేనా?

సురా—ఉండు. రాముడూ! సిల్కు కండువా, కోటు గడియారం
అన్నీ నీవే లాక్కుంటే యిప్పుడు యింటికి వెళ్ళాలంటే.

ఇందు...అదే నేను చెప్పవచ్చేది కూడాను. ఎప్పుడూ యింటికి వెళ్ల
వలెననే చూపా? ఇక్కడుండా మని లేదా, నా అందచందములు
మీాకళ్లకు నచ్చలేదా! నాసరసములు మీాకు రుచించలేదా!
నా వాక్యములు మీా చెవులకు కఠోరములుగా వున్నవా!

సురా—నీతోడు నీనోటివెంట నీవ ౧౧లనఁగూడదు. నేవినఁగూడదు నామీాఁదవొట్టు. సుందరీ' నీవెట్లాఁవున్నా సరే. ఈ సింగారములన్ని తీసివేస్తే మాత్రం నీ యందానికి లోటువస్తుందా ? నీవు మూతి ముడుచుకోని గూర్చుంటేమాత్రము సరసానికి లోపమువస్తుందా? నీవు బూతులు తిట్టితేమాత్రం నా చెవులకు విపరీతంగా వినబడు తవా ? ఎందు కిదంతయును. ఆగు ఆగు.

ఇందు—ఇంత నాసనతో – ఈ వేషముతో—ఈ వాఁగ్ధోరణితో— ఈవుయ్యాల నడకలతో... యీా వింత చూపులతో...ఈ విపరీత చర్యలతో—యింటికి వెళ్లుదమనే మీా యభిప్రాయమా ?

సురా—అఁ. అంతేనా ' పందెం వేస్తారా ? ఒక్కడనే పోనా (అని లేచి తూలి క్రిందఁబడి మరల లేచి) భావా ' రామన్నా ! నవ్వ కురా ? కాలు తూలింది. కాదు. జారింది.

రాము—నవ్వనులెండి. మీారు పడడం నేను నవ్వడమునా ? మనలో మనమే నవ్వుకుంటె యెట్లా ' అంతా అట్లా పెట్టండి. మీాకన్న తక్కువ తాగిన లంజాకోడు కెవఁడు చెప్పండి.

సురా — సుందరీ ! విడితో నేమిగాని నేదీ వొక ముద్దు పెట్టూ మజాగాను.

ఇందు—ఒకటిగాదు. నూరు పెట్టెదను. ముందు మనపని గానీయండి. ఆలస్యం అమృతం విషమన్నారు.

సురా— ఓ ' లెక్కలేకుండా ! కానిప్పించు ప్లాంపు. నాకేమి సంశయ మనుకున్నావా ? నన్నుఁగాక నీవు తింటావా ?

ఇందు—మా జాతినిబట్టి లోకమంతా విపరీతముగా మాట్లాడుతారు గానీయండి నాసంగతి మీారు యిన్నాళ్ళనుంచి చూస్తువున్నారు గఁదా ! ఎప్పుడయినా! ఏవస్తువుచేసుకున్నా ' ఏచిత్రంచేసినా ? మీారులేనిదే. మీారు రానిదే. నేనొక్కదాన ననుభవించానా ?

మీ బాగుకోసం చెప్పితినిగాని నావల్ల యేమీ పడదుసుమండీ.
మీ యిష్టం.

సురా — అబ్బా! అదంతా ఎందుకు! కాగితం తెప్పించమంటినిగా.

ఇందు — తెప్పించితిని. వ్రాయించి యుంచితిని. మీదస్కతు మాత్రం కావలసియున్నది. ఇక్కడనేయున్నది కూడాను పట్టుకొని వస్తాను.

సురా — పట్టుకురా పెట్టుతాను.

(ఇందువదన వెళ్ళెను).

రాము — బావగారూ! అదుగూబాడుగూ గన్మైనాప్పుందేమో పేకు క్కురానా!

సురా — ఊఁ! పో.

రాము — (వెళ్లెను).

సురా — ఇది యానందమే. స్వర్గలోకసౌఖ్యానందము. దీనిని మించిన యానందములేదు. నే నెక్కడున్నానిప్పుడు. ఎక్కడున్నానా! నా మేడలో — దీనిని నిషేధించామన్నారు. వీరు మాకేమి దొరలా! లార్డ్లా! గవర్నమెంటా? అందరికన్న గలవుతుందో కాదో, అని నిషేధించారు. అర్భకులు వాసనపట్టలేక నిషేధించారు. దీని పేరె ఆస్తివుంచితే చాకు చిప్పాకత్తాయిస్తుందట. వీధిలోకి యీడుస్తుందట. ఈఛ్ఛేదయితే యీపాటికేయీడ్చును. వీడి తాతముల్లె ఎత్తా పోయినట్లుగా తాగబోకు. గుండెలుమాడుతాయి అంటాడు. (కృష్ణునిపటముఁ దీసి) ఓహోహో! ఏమివిగ్రహమండీ! బాలగోపాలకృష్ణుఁడు. నవనీతచోరుఁడు. గోపికావస్త్రాపహారి— కోకలన్నీ యెత్తుకుపోయి చెట్టుమీఁదఁగూర్చుంటె ఎట్లానున్నాఁడో నేనుగూడా అట్లాచేస్తే ఆడవాళ్లంతా ఏమంటారో? కృష్ణుఁడంటారా! దేవుఁడంటారా! అనరు. దొంగదొంగ అని వీపు పగిలే వఱకు కొంచుతారు. తాగినసీళ్లు కక్కేదాకా తంతారు. ఎముకలు

వేరుతారు. చూర్ణంచేస్తారు. కృష్ణా! నీపుణ్యమేమిరా! నివంటివా
ణ్నిగాదూ? నేను మగవాణ్ణిగాదూ? నీకు పదహారువేల నూట
యెనిమిదిమంది భార్యలేమి? నేను యిద్దరితో వుంటనే యీజనం
అంతా కళ్లల్లో నిప్పులుగొట్టుకోవడమేమి? నివుదేవుడవా? నేను
దయ్యాన్నా? నిన్నుగన్నట్లు మాయమ్మ నన్ను కనలేదు? నీవు దేవుం
డవేగాని దొంగలంజకొడుకవు. నీగుణాలన్నీ మంచివేగాని ఆరెండు
చెడిపోయినాయి. (క్రిందబడ వేయగా బటము బ్రద్దలగును)
పగిలిందీ? వెధవపటము. ఇవంటివనేకపటాలొస్తాయి. డబ్బును
మనముసంపాదించామూ మన్నిడబ్బుసంపాదించిందా? వెధవడబ్బు.
తాగానువాసింమ్ము నేనుతాగుతాను. నాతండ్రీయిచ్చాడు. చచ్చాం
డు. మా అమ్మకు నామీదకోపము. దాని అండజూచుకుని నా
పెళ్ళాంకూడా నన్నేమో అనాలని మిర్రిమిర్రి చూస్తుంది. అనడ
మేనా? నోరుతెరిస్తే పక్కటెముకలు విరగవూ? నుంచోలంటే
నుంచోవాలి. కూర్చోలంటే కూర్చోవాలి. అంతే మన సంగతి.
వ్యవహారాలెల్లావున్నా అనుకొన్నట్లుగా జరిగి తీరవలసిందే గాని
యెదురువచ్చిందే పంతులు తడాఖా. ఊం. నాసంగతెరుగనివారె
వ్వరు? (సీసా చేతబుచ్చుకొని) బ్రాందీ. చక్కని బ్రాందీ. నిర్మల
మైన బ్రాందీ. నాప్రాణతుల్యమైన బ్రాందీ. అమ్మా! నా జన్మలో
నేను బ్రతికి వుండగా విడవడమేనా? హుం. వస్తే. ఓ ప్రియ
మైన బ్రాందిసీసాగారూ! సలాం. నీప్రభుత్వమాచంద్రార్క
ముగా నిలుచుగాక. అందాక నాసేవ నీకు లభించుగాక. పెద్ద
ఆచారంపెట్టుకొని బైటున్నదని లక్ష్మీదేవిని అవతలికి గొట్టితే
యెంత దశపట్టిందో నిన్ను నిషేధించామనే వారికందరికీ అంతె
దశపట్టుగాక. సురానందులవారి శాపము వేదములోనిముక్క.
మాదేశంలో వున్న సముద్రాలు. ఏర్లు. చెరువులు. కాలువలన్నీ
కూడా బ్రాందిమయం చేయాలని వుంది. తలుచుకుంటే యెంత

సేపు. అమెరికా దేశంలో కార్నీజివారగారు అనలేదా! ఎప్పటి కైనా కోటీశ్వరుణ్ణి అయితే పుస్తకభాండాగారాలతో దేశ మంతా నింపాలని! ఏమో! అంతవాణ్ణి కాఁగూడదూ? అప్పుడు యీ మద్యపాననిషేధకులంతా సమపుతారు! ఇప్పటి కీదేశం లో మాపార్టీ ఎక్కువ. కాదనేవారి పార్టీ తక్కువ. అసలు వారు మావారు. చుట్టుపట్ల యెవ్వరూ లేరుగందా? నాబోగందాని యింట్లో నేను నూఅనుకొంటాను. వద్దని బోధచేసేవారు, లెక్చర్లు కొట్టవారు బయల్దేరారా! మాజట్టును వప్పగింతపెడి తే నాసామిరంగా అని బుర్రలు రామకీర్తనలు పాడించరూ? (అటునిటుఁజూచి) అదుగో వస్తోంది. యీ అప్పు పెంకులు చూ చిందా తిట్టుతుంది (అని సుందరగా నెత్తుచుండఁ బెంకు గుచ్చు కొని నెత్తురు వచ్చును). అబ్బా! గుచ్చుకుందే? నెత్తురు. (చేయు రాయుత్తుకొని) పోయింది. పోయింది. ఎంత దెబ్బ తగిలినా కనఁబడ నీయదు గదా (త్రేపి) సోకువస్తూవున్నట్లుందే. (ఆపుకొనును) ఆగదు. ఆగనట్టుగా లేదు వ్యవహారముచూస్తే. కుర్చీమీఁద పడు కుంటా (అట్లుచేయును).

ఇందు—(ప్రవేశించి) పంతులు గారూ! పంతులు గారూ! నిద్రేనా? దొంగ నిద్ర!

సురా—కనుక్కున్నావే టక్కరిముండా!

ఇందు—కనుక్కున్నాగాని యండి ఈ అల్లరేమి టండీ! బాగానే వుంది.

సురా—సురానందులవారి కడ్డుమాట రానీయఁగూడదు. వేమన్నగా రంతటివారు. చిత్తుగా పూర్తిగా కడుపునిండా తాగవచ్చునన్నారు అప్పుడుగాని ఆనందం కుదరదన్నారు. అప్పుడు గాని దేవుఁడు కనుపించడన్నాఁడు. (చేతులుచూచి) ఎవరువీరు! ఇందువదనేనా? నా మనోహారియేనా? నాభామా శిరోరత్నమేనా? నా బంగారు

బొమ్మదేనా? నా చిలుకల కొలికిదేనా? దొంగముండా! చెల్లిం
చుకో నీ ముద్దు! చెల్లించు నాముద్దు.

ఇందు—ముద్రాంత సేపు లేదండి! కాగితము తెచ్చి యుంచితిని.

సురా—తే!

ఇందు—(యిచ్చును)

సురా—(సంతకం పెట్టును) తీసుకో. వెధవది యింత మాత్రం దానికి
పెద్ద బ్రహ్మాండమా? నాలుకొకటీ సుమా! పుట్టించే దెక్కడనో
తెలుసునా?

ఇందు—మీకు నిద్ర వచ్చుచున్నట్లున్నదే.

సురా—అవును పక్కేదీ.

ఇందు—పక్కలు తక్కువగునా! మెల్లగా గదిలోకి వెళ్ళి పరుండండి
నేను యిప్పుడే వత్తును.

సురా—తొందరగా రా! పందిరి పంచముమీద పరుండెదను. నీవు
వచ్చువఱకు నిద్రపోను. (అని నెమ్మదిగా వెళ్ళును.)

ఇందు—అమ్మయ్యా! కావలసిన పని పూర్తి అయినది. ఇంకనీశ్వ
శ్వరుడెట్లు పోయిన నాకేమి? ఈతడెంత? ఎన్నవవాడు?

సీ. పిసినిగొట్టయిన యా ♦ వీరయ్యశెట్టి యా
స్తినిగుంజి జోలె నం ♦ దించినాను
నాబులూరికవాగి ♦ డబ్బియు నేర్పు నా
గురునాథు జప్పగా ♦ గొరిగినాను!
భోగంబు గొలికించి ♦ జోగినిగా జేసి
పార్థసారథిని బట్టె ♦ పంపినాను,
వాల్పాపులోన లో ♦ భత్వంబు మఱపించి
శేషయ్యను బిక్షు ♦ జేసినాను

గీ. వారువీరన నేల న ♦ వ్వారు నాదు
చేతిలో దాటిపోయిరి ♦ నాగరంబు

గానిపోకటున్నదే యందుఁ ♦ గాదె మాదు
వర్ణమంతయు ననుగౌర ♦ వముగఁజూచు.

వెలయాలి వెలివితేటలలోని ముఖ్యములగు ఘట్టములందు చక్కఁగా దరిబీయుస్తైన నే నీమాత్రపు స్వల్పపుపనికి జంకుదునా ? తరతరంబులదాక సుఖముగాఁ గాలిపైఁ గాలు వేసుకొని యనుభవిం చఁదగినయాస్తినిసంపాదించితిఁగదా. కాని తమ్ముఁడు త్రాగుఁబోతు. తల్లి నల్లమందుది. ఇదిగాక నన్నుగూడ నీముండాకొడుకు మూతిముం చినాఁడు. సంపాదించుటకేమి. వేలు, లక్షలు, కోట్లు గడించుటకో మావాండ్లుప్రజ్ఞావంతులే. కాని యేమిప్రయోజనము:-మాముండలు!

గీ. చల్లఁగా నెవరికేని నా ♦ పక్కుపడి ధ
నంబుసర్వంబు వాడి మొ ♦ గంబునందుఁ
బెట్టి యవ్వాల జోలెతో ♦ భిక్షమునకు
వెదుకుచారు సిగ్గుబిడియముల్ ♦ విడిచిపెట్టి.

ఇఁక ముసలిముండలసంగతిఁ జూతమా !

గీ. కల్లు త్రాగుటకనికొంత ♦ నల్లమందు
కనుచుఁగొంతఁ బుగాకున ♦ కనుచుఁగొంత
ననుదినంబును వ్యయముఁ జే ♦ యంగ మొదలు
పెట్టి సర్వంబునకుఁ జేటఁ ♦ గొట్టుచుంద్రు

ఒకవేళ వీరుశోభుల్తై కొద్దియో గొప్పయో దాచుకొన్నను మగముండాకొడుకు లూరకుందురా.

గీ. త్రాగుబోతులరై సమ ♦ స్తమును గొల్లఁ
గొట్టి కర్రలజేఁ గొని ♦ కొట్టి తిట్టి
బయట రౌడీలతోఁ జేరి ♦ వాదులాడి
చేరుచుందురు రచ్చల ♦ సిగ్గువిడిచి.

గీ. జూదములనాడి మితిలేని ♦ పోకలందు
బుద్ధిఁ బొరనిచ్చి రోడ్లపైఁ ♦ బొరలి పొరలి

పౌరుషజ్ఞాన కీర్తుల ♦ వదలిపెట్టి
తిరుగుచుందురు దేశ ద్రి ♦ మ్మరులరీతి.

**రాము**—(ప్రవేశించి) అక్కా! బావగారు ప్రక్కనిండా కక్కారే!

**ఇందు**—వాడి దుంప తెగ. అనుకొన్నంతా చేశాడు. రాముడూ! ఆపసువు కింద పోసి కొత్త మన్ను పోయలేకపోయావా?

**రాము**—నీతో చెబుదామనివచ్చా! వెళ్లుచున్నానులే. నీవుగూడా రా!

**ఇందు**—వస్తావున్నా పద! (నిష్క్రమించును.)

**రాము**—ఓరి బ్రహ్మదేవుడా! మాగతి యింతేనా?

సీ. మాటల మోసంబుల ♦ నీతుల నందింప
వృత్తిమీకంచుఁ ♦ గల్పించినావు
శిష్యాలఁ జేర్చి యా ♦ చెనటులఁ గృత్తఁ జెం
దించు మీ గతిగఁ జే ♦ యించినావు
నీచంబుయిన యుక్తి ♦ సూచనా వృత్తిగా
దిక్కు మీకంచు వి ♦ ధించినావు
పవలు రేలును బుట్టి ♦ భ్రష్టులఁ బిలుచుకో
మీ విధియంచు ని ♦ ర్మించినావు!

గీ. త్రాగి కక్కిన వారల ♦ గండ మొఱగి
సేవఁ జేయుటగా గతిఁ ♦ జేసినావు
నముపు సంధ్యల బుగ్గి పా ♦ ల్గలిపినావు
పాడిగొనినట్టి యీ బుద్ధి ♦ బ్రహ్మదేవ.

(అని నిష్క్రమించును.)

---

శ్రీ

# సురానంద



## చతుర్థాంకము.

మాధ—(ప్రవేశించి స్వగతము) కట్టా! ఎట్టి దేశమున కెట్టిగతి పట్టినది?

శా. కర్మక్షేత్రము భారతోర్వియని ప్రఖ్యాతిఁ గాంచెం గనజాలి స
ద్ధర్మంబుల్ మితిమీఱి సంపదల వేదప్రాభవం బందఁగా
మర్మప్రక్రియఁ జేరికొందఱు సదా మద్యంబునుం ద్రావి దు
ష్కర్మారంభుల గాటఁ దావుగలిగెం గా నీకు దారిద్ర్యమా!

ఔరా ఈపాపము భరతఖండమునకు రాఁదగినదేనా?

సీ. సకలవేదపురాణ ♦ శాస్త్రంబులుద్భవిం
చిన భూమికా యిట్టి ♦ చెట్ట బుట్టె
సిరిసంపదల విల ♦ సిల్లుచుఁ బ్రభఁ జెంగు
భరతోర్వికా! యీ వి ♦ పత్తు కలిగె
వీరకర్మవ్రతో ♦ ద్వీపేరఁ బరగిన
రణభూమికేన? మా ♦ రకము బుట్టె
ధర్మంబు నాల్గు పా ♦ దములపై నడచెడు
కర్మభూమికె? యిట్టి ♦ కర్మమొదవె?
కారణమ దేలకో యిట్టి ♦ కష్టదశకుఁ
జిక్కె భారతజనయిత్రి ♦ సుఖ్కియుంట
కక్కటా! మద్యపాన దు ♦ ర్వ్యసనమందు
సుతులు మ్రగ్గుటె కాఁబోలు ♦ చూడఁగతము.

సురాపానంబు సప్త వ్యసనంబులలో నొక్కటి యనియు, హైందవమతాచార విరుద్ధంబనియు, శృతిస్మృతులును, పురాణేతిహాసంబులు ఘోషించుచున్నవే ? ఇట్టి దురాచారంబుల విసర్జించి స్వధర్మానుష్ఠానపరులగుఁడు దేశాభ్యుదయమునకుఁ బాటుపడుఁడని దేశబాంధవు లుద్ఘోషించుచున్నారే ? ఒక్కరును వారి యాదర్శనములను, వారి విజ్ఞాపనలను చెవులఁ జేర్చువారు లేరే! వినకున్న వినకుందురుగాక. పైఁగా.

గీ. డాళ్ళ పై రువ్వి, మద్యక ♦ ర్రలను దాల్చి
కొట్టఁగా దొమ్మిగావచ్చి ♦ యిట్టి పురము
పగలి వెళ్ళడిదాక ద ♦ ర్భరదురంత
కార్యము లొనర్చుచున్నారు ♦ కలుషమతులు.

ఈ నవనాగరికతాభ్యాసమునకు లొంగిన కొందఱు యువకు
లీ మరభ్యాసమునకు లొంగి

శా. నిద్రాహారములన్ త్యజించి ధనమెం ♦ తే ప్రాణతుల్యంబుగా
భద్రంబొప్పఁగదాచి పెద్దలిడు న ♦ ర్థస్వంబు క్షీణింపఁగా
క్షుద్రప్రక్రియ మద్యపానమునకున్ ♦ భోగంబులంచున్ గృహ
చ్ఛిద్రంబైనను లెక్కఁజేయక యె వె ♦ చ్చింపంగఁ జొచ్చెన్ గటా.

ఆహా! ఈ సురాపానీయము దేశమునంగల ప్రతిపట్టణంబునను బల్లెలందును విరివిగా నమ్ముకొని భారతీయుల గౌరవకీర్తుల నాశపఱచుటయే గాక మితిలేని ద్రవ్యంబును గుంజుకొనుచున్నయది గదా. దారాసుతాదుల వస్తువాహనంబుల సంగ్రహించుకొని యర్పించుకొను వారు కొందఱు, పవలంతయుఁ గూలినాలిఁజేసి దారాసుతాదులఁ బస్తుంచి వ్యయపెట్టువారు కొందఱు, పూర్వార్జితముల నాశమొనర్చి కొంపలార్చుకొనువారు గొందరు. అక్కటా! రాను రాను దేశమెంత యధోగతిలోనికి వచ్చినది. ఈమత్తువస్తువులు.

గీ. కొల్లకొల్లలఁదిగ ద్రవ్యంబు ♦ గుంజుకొనుచు
గర్భదారిద్ర్య మనెడు సా ♦ గరమునందు
ముంచుటను దేశమాత కృ ♦ శించి సుతుల
ప్రల్లదనముల కెంతయో ♦ వగచుచుండె,

ఈ నిర్భాగ్యులు కుక్షుకనిండఁ ద్రాగి వీధులవెంటఁ బోవుచుఁ జేయు వికారపు చేష్టలఁ దిలకించుచున్నప్పుడెల్ల నా హృదయము కటకట పడక మానదు గదా!

గీ. ఒకరి పైబట్ట క్రిందనే ♦ పడెనో భుజము
పైన నేగలదో! యింత ♦ యేని తెలియఁ
జాలనంత దుస్థితినుండి ♦ గోలఁ జేసి
కొనుచుఁ ద్రోవలకడ్డుగాఁ ♦ జనుచు నుంద్రు.

గీ. నీతిజాతి విసర్జించి ♦ బూతుమాట
మొదలు పెట్టుచుఁ గనఁబడ్డ ♦ సుదతులెల్ల
పిచ్చివర్ణనలనుఁ జేసి ♦ విచ్చలవిడి
పరుషములనాడుచుందురు ♦ మరితులగుచు.

గీ. గోష్ఠిపై ద్రొబ్బువారు న ♦ గుటకువచ్చి
బొడ్డులంపునఁగల్గు డ ♦ బ్బులను మూటఁ
దీయువారు పరామర్శఁ ♦ జేయువారు
కొందఱగుపించుచున్నా ♦ రలెందుఁగన్న.

ఇట్టి దౌర్భాగ్యులఁగన్నపుడయ్యమ్మ శాశ్వతవిచారసాగరంబున మునింగియున్నదన్న నాశ్చర్యమేముండును. ఈమద్య మెంతపరిభావముచే మా దేశంబునఁ దాండవమాడుచున్నది!

గీ. మద్యమా! నీవులేని దే ♦ యుద్యమంబు
సాగఁగాఁబోదు నీదెంత ♦ సాహసంబో!

పదముపెట్టిన నక్షత్ర ♦ ఫలముగాడ
వెలుగుచున్నావు దశదిశా ♦ వలయమందు.

గీ. ఎన్ని కోట్లుగడించుచు ♦ నున్నఁగాని
తనివితీఱదు నీకు మ ♦ ద్యంబ ! నిది
కడుపో? లేకను జూడంగ ♦ ఖండవల్లి
మడుగో ? యేదియుఁదోచద ♦ య్యెడివినాకు.

మర్మార్గచరిత్రుండగు గిరిమూర్తిగాడ సహవాసంబునుమఱఁగి సురానందుఁడు పూర్తిగాఁ జెడియెను. ఆబాల్యమిత్రుఁడను, రక్తబంధుఁడనన్నమాటయే మరచెను. నన్నుమఱచిన నేమంతయుపద్రవము కాని '

గీ. తండ్రియార్జించి యిచ్చిన ♦ కొండ్రవెల్ల
వాసియిచ్చె భోగముదాని ♦ వలనుదవిలి
స్నేహితులతోడఁజేరి వె ♦ చ్చించె రొక్క-
మంతయును ద్రాగుటకును జే ♦ కాటలకును.

జానకమ్మ దీనాలాపములువిన్న నెవ్వనికంట నీరు రాకుండును- ఆమహాపతివ్రతాశిరోమణిని దిలకించిన నెవ్వనిగుండెలదరకుండును

సీ. పెండ్లికాలమునందుఁ ♦ బెట్టిన నగలెల్ల
నూడగొట్టుకుపోయి ♦ యూడ్చిపెట్టె
పుట్టింటివారలు ♦ పెట్టిన నానుపో
చయు నెత్తుకొనిపోయి ♦ నానికచ్చె
నల్లపూసలయందు ♦ నఱగల కాసును
పట్టుకుపోయితా ♦ కట్టఁబెట్టె
పెట్టెలోనున్నట్టి ♦ పట్టుచీరల నమ్మి
పేకాటలో నోడి ♦ పెట్టివచ్చె

గీ. నెన్ని చెప్పిన వినకఁదా ♦ నెంతజేయఁ
గలఁచెనోయంత జేసి వృ ♦ థాగఁ జెడియె

సర్వవిధములఁ జెడిపట్టి ♦ జానకమ్మఁ
గన్న గుండె లవిసిపోవఁ ♦ గాదె యకట.

(ఇటుఁ నిటుఁ జూచుచు) అదుగో సురానందుఁడిటే వచ్చుచున్నాఁడు. ఈ దినమునఁ బూర్తిగా మందలించెదఁగాక—

సురా—(ప్రవేశించి) నన్నుఁజూస్తే అందరికీ ఆగడమే. నా ఆస్తి నేను పాడుచేసుకున్నా వీళ్ళకే. పెళ్ళాం నగలమ్ముకున్నా వీళ్ళకే, భోగం దానికి మాన్యాలు వ్రాసియిచ్చినా వీళ్ళకే. వీళ్ళ సొమ్మేమైనా పోయిందా? అయిపోయింది. బ్రాందీ తాగె రోజులు. రెఫ్రెష్ మెంటురూము బాకీలు. పూర్తయినాయి. సారాసీసాల్లోకి వచ్చింది వ్యవహారం. రోజుకు రూపాయి దొరకడం కూడా కష్టములోఁ బడ్డది. ఎంతో నమ్మకంగా అంతా నీదే. నీవే నేను. నేనే నీవని చెప్పింది. దాన్నన్న పాపమేముంది. తింటు తిన్నది విధవ మాన్యాలు. గీత బాగుండాలిగాని యెంతైనా సంపాదించాలి. పే రెక్కడకుఁ బోయింది. నాలుక పీక్కొని యెంతచచ్చినా నేనుయిచ్చిన ఆస్తి నంటూరా! ఇవ్వాళేఁ బయటకు గొట్టిందేమో! రేపు యమధర్మరాజుగారి ముందు అనుభవించాలేమో ఏముంది! ఇస్తి వాయనం. పుచ్చుకుంటి వాయనం. వాళ్లు బాగుపడ్డప్పుడు చూదాము. నాలుగురూపాయలు తెస్తే కాస్త నయమదలచేలాగుంది. రేపునోములంట ఎక్కడనుండి తేను? కన్నుఁబొడుచుకున్నా చిల్లిగవ్వ కనఁబడదు. అప్పిచ్చేవాళ్లు లేరు. ఎవరిస్తారు. ఎరిగియున్నంతవఱకీయరు. పై తాకట్టుపెట్టి లోపీకంచుతామంటే తూర్పుబండి తయారుగా వుంటుంది. అన్నట్లు మరచిపోయాను. అంతా పోఁగా మంగళసూత్రం మిగిలి యున్నది. అది తెంపానా? బ్రతికివుండగానే తెంపనా? ఆమాత్రం తేలేసి విధవకు ముండే మీటంటూపి గందా—చెడి అమ్మినా పదిరూపాయలు వస్తవి. విధవ సారాపావలా దాసితో మూసి ముంచితే రేమి మజావుం

టుంది? నాలుగుపోయినా ఆరుంటాయి. ఆనందంగా నాలుగు రోజులు వెళ్లుతుంది. మాధవుఁడు కొంపతీస్తున్నాఁడు కనఁబడ్డప్పుడల్లా పిలుస్తాడుగాని ఎల్లాగో తప్పుకుంటున్నా! మాట్లాడా లంటాఁడు. ఏమి వ్యవహారాలున్నాయి. చకారగుళ్ళకులంకించుకుందామనేగా వాడి వేడ్కు. ఈ దారినిఁబడి వెళ్లాపోతే సత్తా చిక్కదు.

మాధ—సురానందా, సురానందా.

సురా—ఎవఁరా వాఁడు. అవశకునప్రశ్న. ఎనిమిదా పోతావుంటే పిలుస్తాడు. బుద్ధి లేదు.

మాధ—నేను గాని క్షణము నిలువుము.

సురా—నిలువను.

మాధ—ఒక్కటేమాట. రెండు నిమిషములకన్న ఎక్కువ పట్టదు.

సురా—ఎందుకో చెప్పు.

మాధ—నే నెవరో గుర్తించితివా?

సురా—మాధవుఁడవు. పెత్తండ్రి కుమారుఁడవు. రుక్మిణమ్మకు సుబ్రహ్మణ్య సోమయాజులకు కొడుకువు. నాకన్నవు. నా పెళ్ళానికి బావవు. యిదేనామాట.

మాధ—తొందర లేదు. కొంచెము నిదానముగా మాట్లాడుము.

సురా—ఏడవవోయి. ఏడ్చేమిటో.

మాధ—నీభార్యకు శాపగారినైన యిందువదనకో.

సురా—అంతా దాన్ని చూచి నవ్వేవారే. దాని పేరెత్తేవారే.

మాధ—దానిని జూచి నవ్వుట యెట్లున్నను నిన్నీవిధమునఁ జూచుటకు మాత్రము విచారించుచుంటిని ఏమందువా?

ఉ. జంకవు చూచువారల కి ♦ సహ్యముగాఁగ నుంటివంచు లోఁ
గొంకవు రాత్రియుం బవలుఁ ♦ గూడను దాగుచు నుంటివంచు నీ
వంకరచేష్టలం గని చి ♦ వాట్లను బెట్టెడువారి చూడ నీ
వింకను బుద్ధిరాఁ జరి ♦ యించుటఁజూచిన నేడ్పుకాదొకో,

సురా—ఎవరిసొమ్ము? నానాయన సొమ్ము. నాకు యిచ్చెను. ఖర్చు పెట్టితిని. నాసొమ్ము పోయినందుల కడుగుటకు మీ కేమిరూల్సున్నది?

మాధ—రూల్సేమియు లేకున్నను.

గీ. రక్తబంధువు తనదు స ♦ ర్వసముదురిత
కార్యముల పాలుచేయుటఁ ♦ గనిన యొకప్ర
చింతచే యూరకోనలేక ♦ నింతబోధఁ
జేసి తామందుచుందురు ♦ చిత్తశాంతి.

సురా—చేశావు వినలేదు. నీకు చిత్తశాంతేగా కావల్సింది. ఏం.

మాధ—నాయనా! తృణీకరింపకు నా మాట వినుము.

గీ. త్రాగుడందు మరగినవారు ♦ జోగులగుచు
సర్వవిధములచేత భ్ర ♦ ష్టతను గాంచి
యెందునకుఁగాక చెడిన వా ♦ రెందరిలను
నల్లలాడుచునున్నారొ ♦ యరయుమయ్య.

సురా—దానిలో మహత్తుఁ దెలిసికోకుండా వెధవ కబుర్లు చెప్పుతా వేమిటిరా.

మాధ—తమ్ముఁడా! నీకుఁ దెలిసినంతగా నాకుఁ దెలియకున్నను లోకానుభవమును బట్టి, జరుగుచున్న విచిత్రములను బట్టి, చూచుచున్న విపరీతములను బట్టి నా తెలిసినంత వఱకెఱింగినదిది.

సీ. లక్షలాహరించి ♦ భిక్షుకునిఁ జేయు
దార్ప్యదుగత్తె యీ ♦ త్రాగుబుద్ధి
బలమెంతయున్న దు ♦ ర్బలుని గావించుచుఁ
దనువు దగ్ధముఁ జేయుఁ ♦ ద్రాగుబుద్ధి
మానమున్నను గాని ♦ మానంబు హరియించి
తలవంపుఁ దెచ్చునీ ♦ త్రాగుబుద్ధి

కులగౌరవముఁగూల్చి ♦ నలుపురిలోన నిం
దలపాలు గావించు ♦ త్రాగుబుద్ధి
గీ. పూర్వులయశంబుబూదిలోఁ ♦ బూడ్చిపెట్టి
తెలివితేటల దిగఁద్రావి ♦ దివ్యములగు
రూపములనూడ్చి నిత్యంబుఁ ♦ బాపకార్య
ములకు దారిచ్చు నీత్రాగు ♦ బుద్ధి నిజము.

మఱియు: —

గీ. తగనివ్యయముల మనుజులఁ ♦ దార్చి పెద్ద
చివ్వలంబెట్టి రచ్చలఁ ♦ జేర్చి రాజ
దండనల పాలుచేయు నీ ♦ త్రాగుబుద్ధి
తగదు తగదయ్య మనకిట్టి ♦ త్రాగుబుద్ధి.

సీత: వినుగుకొనియెదవని యింతతో విరమించుచుంటినిగాని లేకున్న నీ త్రాగుడువలనగలుగు నరిష్టములనుగూర్చి చెప్పవలయునన్న దినములుచాల వన్ననతిశయోక్తి గాదుసుమా.

సురా — నీవెన్నాళ్లువాగినా నాబుజ్జికెక్కదు. నామనసున కేదితోచిన నదిజరుగవలసిందే

మాధ — నీమనస్సునకుఁదోచినదే యార్యమతసాంప్రదాయమని విశ్వసింతువా? హితంబుల నాలింపవలదా? భావిగతిఁ జూచుకొనవలదా? ప్రపంచమునకు వెఱువవలదా? భార్యయవస్థఁజూడవలదా! ఈ దుర్వ్యసనమునఁజిక్కి చెడిపోయినవారిచరిత్రలవినియైన బుద్ధిఁ దెచ్చుకొనవలదా! అయ్యో! వడసారము ముప్పదేండ్లు లేవే! ఇంక నెంతయోకాలము జీవింపవలసినవాఁడవే. ఇంతియగాక

గీ. అగ్రవర్ణంబునందు వే ♦ దాధ్యయనప
రునకు జన్మించితంచు నీ ♦ మనమునందు

క్షితివహింయింపవలదె యీ ♦ రీతినీతిఁ
దక్కి చరియింపఁగానేఁనె? ♦ తమ్మునకుఁ.

నీతండ్రి నీకొఁఱ కెంతొ కష్టపడియనో యోజింపవలదా ?

గీ. సరిగఁదిన లేదు మంచివ ♦ స్త్రముసుగట్టి
యెరుఁగఁ డావిధగడియించి ♦ యింతిధనము
భూమి, యిచ్చినఫలితమే ? ♦ బుద్ధిమాలి
సర్వసంబును నష్టపా ♦ ల్చేలువుకొనుట.

సురా—అవును, నాతండ్రి యిచ్చినాడు. చెప్పే మీవాటివాళ్ళంతా ఆయనకు తద్దినం పెడుతున్నారా ? మీకుఁగూడా పెట్టలేదని యేడ్పు గామాల్ను.

మాధ—నాహితము నీకు వికటముగాఁ దోఁచినను, నీవు తలయుఁ దోకయు లేని ప్రత్యుత్తరంబుల నొసంగుచున్నను, బంధుగుఁడ నగుటచేత, నీహీనస్థితినిజూచి జాలిఁబొందుచున్నవాఁడ నగుటచేత చెప్పకఁ దప్పదు. నీకు విసుగు జనించునని మానుటకు వలను పడదు. మఱియొక విశేషము.

గీ పెట్టుపోతల సంగతు ♦ లెట్టులున్న
గౌరవా గౌరవముల భా ♦ గమునుబంచు
కొనుటలో మేము నీ బంధు ♦ గుల మటంద్రు
లోకమును మాయనెంచ్రైన ♦ మాటెపడన్న.

కాన,

గీ. చెడిన దేమొ చెడనివి యింక ♦ చెడకుమయ్య
త్రాగుడు తనంబిఁకనుమానఁ ♦ దలఁచుమయ్య
బంధుగులయందు గౌరవం ♦ బందుమయ్య
కులము, కీర్తిని, నీతిని ♦ నిలువుమయ్య.

సురా—ఏదీ ! అనమను. ఏగాడిద నేను చెడ్డానంటాడో. మక్కెలు

విరగదంతాను. ఎక్కడో చాటున గడ్డితిన్నారని యంటే ఎట్లా. కాదమ్మా! చెడ్డపనుకో కాస్పేపు. చెడ్డచేతకు మూడు మంచేలా? పోయిన ఆస్తి రానుగదా! పోయిన గౌరవం రాదు గదా? నాకు సేవ పెట్టుమని నేను గాని నా పెళ్ళాంగాని నిన్ను యాచించలేదుగదా! ఇందాక నమ్మకంగావుందిగదా బోగంది. గుప్పెడు మెతుకులు నా మొగాన పారెయ్యదూ! నన్ను గూర్చి నీవేమీ ఆయాసపడనక్కర లేదు. ప్రొద్దెక్కింది. దయచేయండి.

మాధ— అఖండ యశంబార్జించిన వంగడమున కెట్టి కళంక మాపాదించుచుంటివిరా!

సీ. సోమయాజులకొడుకని ♦ శుంఠయగుచుఁ
ద్రాగి తిరుగుచున్నాఁడు ♦ బోగమింట
నన్నముం దినుచున్నాఁడె ♦ యన్నమాకుఁ
గలుగు తలవంపులింతని ♦ పలుకఁ గలనె?

వర్ణభ్రష్టుఁడవై తిరిగినను పోనీయనుకొందము. ఇంతయాస్తిని నమ్మకముగా వ్రాయించుకొన్న యీ బోగముది యైన విశ్వాసవంతురాలా! ఎంత వెఱ్ఱివాఁడవోయి!

గీ. సర్వమంగళ మొనరించి ♦ నాని నికుఁ
బోషణ మొనర్చునన్న న ♦ మ్ముటకు శక్య
మగునె? వినికని యెఱుగుదే ♦ యవనియందు
నట్టివారాకులాన ను ♦ న్నట్టివార్త.

గీ. సొమ్ము గోరిగడిదాక నీ ♦ సొత్తటంచుఁ
బ్రాణములు నీవె యంచును ♦ బలికి పిదప
శునకమునకన్న హీనంపు ♦ చూపుఁజూచి
వెడలనడిపింత్రుగాదె గో ♦ వెలదులకట.

సురా— ఇదుగో! అన్నా! నీమాటలు వినలేదని నీ కాగ్రహము వలదు నాకర్మమెట్లున్న నట్లు జరుగును. పోనిమ్ము.

మాధ— సురానందా! నీకుఁగోపమువచ్చిన నేఁజెప్పఁజాలనుగాని పాపము మాఱడలు జానకమ్మ నీకొఱకేఁత విలపించుచున్నదో నీకుఁదెలియునా ?

సురా—నాభార్యసంగతి నాకుఁగాక నీకెక్కువగాఁదెలియునా ?

మాధ—నాకెక్కువగాఁదెలియనిమాట వాస్తవమే గాని భార్యల నుసురుపెట్టుట మహాపాతకము. అట్టి యుసురుయొక్క ఫలితమును మనమనుభవింపకఁ దప్పదు. ఉదయంబున లేచి యామె ముఖారవిందమును దిలకించినఁ బాపంబులన్నియుఁ బటాపంచలగునే? ఆమె నోట మాటవెలువడిన నమృతంబొలుకుచుండునే ? సురూపసంపదయే. సుగుణాఢ్యురాలే. అట్టి సాధ్వీలలామను సర్వవిధముల గొష్టుఁబెట్టుట మనకు ధర్మముగాదు. నామాటవినుము. చూడుఁ. ఈవిచిత్రకాలమున నట్టి కాంతలబ్బుటయే యరిది. అబ్బిన వారిని చక్కఁగా నేలుకొనక కష్టపరంపరలపాలుజేయుటవలనఁ దరతరంబులదాక నాపాపంబు గట్టిగుడుపుసుమా:—

సురా—ఇంతయుపన్యాసా మెందుకయ్యా? నీకు వాగవలెనన్న చాలా చోటులున్నాయి. చాలామీటింగులున్నాయి. అక్కడకు వెళ్ళి వొక్కొల్లియ్యి. వినను నాయిష్టము మెట్లో అంటూంటే నీకే మెందుకొతెన మెందుకంటూ !

మాధ—రక్తస్పర్శగలవాఁడ వింతవింటివిగదా ! ఇఁకవాదమవిందుకు, ఈపాపకార్యప్రవాహ మిప్పఁటాగునదిగాదు. దీనికడ్డుకట్టయు లేదు!.

గీ. ఎన్నఁడో సముద్రుఁడుపొంగి ♦ యింతపాప
మడచకుండంగమానఁడు ♦ హరిహరాదు
లెప్పుడో బనిఁబూని హ ♦ రింపకుండ
నుండ రీభారతీయుల ♦ దుండగముల.

సురా—పోనియ్యవయ్యా! అప్పుడు మీరంతా మిగులుతారు. మేము పోతాము. ఆన్య రాజ్యమంతా మీరేలుకోండి నేనుపోతాను

(నిష్క్రమించును).

మాధ—వీని జాతిక ప్రభావ మిట్లుండ నెవరేమి చేయఁగలరు.

శా. మాయాజాలమునందుఁ జిక్కువడి దు♦ర్మార్గక్రియాలోలురై
ఆయిల్లాలి మొగంబుఁ జూడక సతం♦బల్లాడుచున్నార దనే
సాయంబుల్ బొనరింపఁ బూనఁడిందులన్ ♦ సంసార విచ్ఛిన్నమున్
జేయన్ జాలిన వీని నేమనుదు ఛీ♦ ఛీ యింత దౌర్భాగ్యమే.

ఏనుఁగు సింహము మున్నగు వన్యమృగంబులు నయితము కడుపార నీరంబులఁగ్రోలి జవసత్వంబులఁ బొందుచుండ మృగజాల మందు లేని యీదురాచారము మానవుల పాలిఁటనెట్లు దాపురమైనదో! హైందవాదర్శవిరుద్ధ కార్యాచరణమున మగ్నులమై యుండుట భారత మాతృవిలాపమునకుఁ గారణ భూతులమగుట నేఁ గనాయున్న విచార మొక్కరికేనియుఁ లేకున్నదే! వేదంబు లుద్భవించిన తావు. మహా ఋషులజన్మలకు స్థానము, శ్రీరామ కృష్ణులుపుట్టిన చోటు, హరిశ్చంద్రాది షట్చక్రవర్తులు పాలించిన నేల! రాజసూయాది మహాధ్వరంబులచే వెలుఁగొందిన! భూమి, అభిమన్యాది వీరపుంగవులు తమ రక్తమును నిజదేశరక్షణార్థ మర్పించిన ప్రదేశము! అష్టాదశపురాణములవతరించిన ధర! ఇందుఁగల కర్మాధికార మెందును లేదే. అట్టి ఆర్యావర్తమిట్టి యగస్త్యభ్రాతలతో, యిట్టి తుచ్ఛులతో, యిట్టి నిర్భాగ్యపు పెద్దమ్మలతో నిండి భూదేవికి భారమును కలుగఁజేయుచున్నారే! మొగంబులకు గుడ్డలడ్డముగాఁ బెట్టుకొని జందెంబులదాచి తక్కుచుఁ దూరుచు నటుల సందుగొందులఁబడి సారాదుకాణములకుఁ బరువులెత్తుచున్నారే ఇంత దొంగతనమేల? సిగ్గు బిడియముల విసర్జించి యీ దుర్వాసనలమధ్య, యీ ముడుసు ముక్కల కాల్పుల

మధ్య, యీ యపవిత్రస్థలముమధ్యఁ జేరి త్రాగి తందనాలాడుచుఁ గుల
గోత్రముల మఱచి యటుల వివిధకులజుల భుజములపైఁ జేతులువైచు
కొని భాగవతము లాడుచున్నారే! ఆ గ్రుక్కెఁడు నీళ్లు గొంతుకలోఁ
బడిన పిమ్మట దొంగతనముగా దుకాణములలోఁ జొరఁబడుట లేనై
నది. అహాహా! ఏమి వీరి మహాత్మ్యత? ఎందఱు కక్కుచుందురో, ఎంద
ఱుమియుచుందురో-ఎందఱాఠిలంబునఁ బరమాసహ్య కరము
లగు పనులఁ జేయుచుందురో తలంచుకొన్న యీ పెద్దమ్మల కొడళ్లు
జలదరించవు కాఁబోలు-ఖండఖండాంతర ములనుండి వచ్చి మనలను
జూచి, మనదేశమునుగాంచి, మన చర్యఁగాంచి-మన విపరీతదశలవ
లోకించి-మన మహాధ్యతవిలోకించి-మన తెలివితక్కువలఁ బరికించి.
హృదయములు కఱగునట్లు మొత్తుకొనుచున్నారే- అట్టయ్యు వారి
రోదన మరణ్యరోదన మొనర్చి-సిగ్గులేక-మానాభి మానములఁ ద్య
జించి-మొండి తనము వహించి-పడద్రాగుచున్నారు. భరత మాత
కాన్పు-నవ్వుల చేటు-తలవంపు-కడు హైన్యత. ఇట్లు చెడఁ ద్రాగి, యల్ల
రులకొఱకు, పోరాటములకొఱకు, విలాసముగా-దాని తెలియక వెఱ్ఱి
గొల్ల వాండ్రరీతి నాటకములఁ జూడవచ్చువారికి-భావగర్భితములై-
రసమిళితములై-గీర్వాణసమాస పూరితములై యొప్పాఱు నాట
కములా గావలయును? ఆదినంబులన్నియు మాయమైనవి. దైవమా!
కన్నులఁ దెఱువవా! ఈ నాభాగ్యుల హృదయక్షేత్రంబులఁ బ్రవే
శింపవా? పాపకృత్యంబుల మాన్పింపవా! ఈ యలవాట్లు వలన
నెన్ని సంసారములు కట్టగుడ్డకు తినదిండికి మోము వాచియున్నవో,
ఎంతద్రవ్య మడుఁగంటి పోవుచున్నదో విచారింపవా? ఎన్ని ప్రాణ
ములు గుండెలు మాడి హరింపఁ బడినవో! యీ విపరీతజీవనము
లవలన నెన్ని ఘోరకృత్యంబులు ప్రబలి ఎన్ని ప్రాణులు హింసింపఁ
బడుచున్నవో తిలకింపవా! ఎందఱు ధనికులు బిచ్చగాండ్రై యల్లాడు
చుండిరో చూడవా! ఓ! పరమేశ్వరా! చిత్ర విచిత్ర నాటకంబు

లాడించుచు, నీ మైంద్రజాల ప్రభావమును లోకంబునకుఁ జాటుచు
న్నావా! నాయనా! భగవానుఁడా! నీ వెఱుంగనిదేది! నీకశక్య
మగు కార్యమేది! ఇది యొక భక్తి భాగవతం బాడించుచున్నావు.
కానిమ్ము. ఓ పరాత్పరా!

సీ. ధనమున్నవారి నా ♦ వ్రతములందు సద్గుణ
బీజంబు వేసి మొ ♦ ల్పించవీవు
చదువుకొనిన వారి ♦ హృదయములను జేరి
సత్క్రియా పరులుగా ♦ సలుపవీవు
పాడిపంటలుగల ♦ వారిలోఁ జేరినీ
పై భక్తిఁ జూపుచుఁ ♦ బఱఁగనివు
వేదోక్తులగు వారి ♦ వేద ఘోషలయందు
స్థిరబుద్ధితో నుండఁ ♦ జేయవీవు
గీ. పరమ తాచారములయందు ♦ వరలుటందొ
సాధువులఁబట్టి హింసల ♦ సలుపుటందొ
కొంపలనుగూల్చి ధనముఁ జే ♦ కొనుటయందొ
వాంఛితాలఁజేతు వీవేమి ♦ బాపుకొనదొ.

నీ యాంతరంగికోద్దేశమేమియో గ్రహింప నశక్యమేగాని.

" క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి ♦ సర్వోపగతుం
డెందెందు వెదకి జూచిన
నందందే గలఁడు దాన ♦ వాగ్రణి వింటే.

అని పోతనామాత్యుఁడు వ్రాసిపెట్టెనే. నిజముగా నీయందంతటి
మహాత్మ్యమే యున్నయెడల,

ఉ. నేర మొకింతలేని తరు ♦ ణీమణియొక్క తె తల్లడిల్ల ధా
త్రీరమఁబ్రోచు నీకిది భ ♦ రించుట దుర్భరమౌనె! దీనమం

దారుఁడవన్న పేరు వసు ♦ ధాస్థలి నిల్పఁదలంతువేని నీ
కారుణికత్వమిప్పుడిటుఁ ♦ గానఁగఁ జేయఁగదయ్య మాధవా.

కొండన్న—(ప్రవేశించి) అయ్యా! మాదవయ్యగారు, జానకమ్మా రుపని యేమైందో యిన్నారా మారాజా?

మాధ—(ఆతురతతో) ఏమయిందిరా! తొందరగఁ జెప్పు!

మాధ—సురానందయ్యగారి యిల్లు బొర్రయ్యచెట్టిగా రొప్పగించుకోడాని కొచ్చారండి. అమ్మగారన్నదిగందా! అయ్యగారొచ్చా కెల్తానందండి. ఆమారారా జేదున్నాఁడా! అకోవఁటి యిన్కుండా యిల్లో దొరమడి సంబు తెప్పాళా బైటుఁ బారనూకి యింటికె తాళమేసిండండి. అమ్మగారు రాక్లోకూకుంది ఏడుత్తోంది. నేనా దారినెల్తుంటు పిల్సి మాదవయ్యగారితో సెప్పి మెట్టు నాయనా అంటు లగెత్తుకొచ్చినా!

మాధ—హరిహరీ! ఎట్టిసంసారమున కెట్టితిప్పలువచ్చినవి!

సీ. తరతరంబులదాకను ♦ దరుగనట్టి!
యాస్తి గల్గిన సంసార ♦ మడఁగి తుదకు,
నిలువ నీడయులేకుండఁ ♦ గలిగెపాట్లు!
యింతఘోరంబులున్న వే ♦ యేడనైన.

దైవమా! ఎంతనిర్దయుఁడవై పోతివి!

ఉ. కడువర్ గూటికిలేకఁబోయినను లో ♦ కుల్ జూడకుండంగ లోఁ
బడియుండంగల కొంపగూడనరిగెన్ ♦ బాపంబికేదారి? యె
వ్వాఁడు జాలిగ్ గనియాదరించు పడతిన్ ♦ భారంబుగాఁగోచి యీ
వలకున్ దోసిన నీకునెక్కడిదయా ♦ ప్రారంభవిస్రంభముల్.

ఇంత యుక్తాయుక్తవిచారశూన్యుండవగుదువని దలంచకపోతి మిగదా! ఓకరుణామయా!

గీ. మగఁడు ఆరీతి వేధించి ♦ మాడ్చుచుండ.
యాస్తి సర్వంబుక్షీణించి ♦ యడలుచుండ
కఠినతనుజూపి నీప్రాను ♦ గాసిఁబెట్ట
జగతి నేరీతిమనును మా ♦ జానకమ్మ.

సీ. తనయాస్తిసర్వంబు ♦ దగ్ధమైపోవునఁ
గినుకఁబూననియట్టి ♦ యనఘురాలు,
పతియెంతనిచంపు ♦ గతిఁ జూచిననుగాని
పరిచర్యమాననీ ♦ భక్తురాలు
కూసుగుడ్డకునుగా ♦ కుందెందిననుగాని
యొరులకుఁదల్పని ♦ యోగ్యురాలు
తనకుఁదల్చినపిల్ల ♦ తనతోడివారికిఁ
దల్పిసన్నుతులందు ♦ దివ్యురాలు

గీ. పరులు తనవారనెడు భేద ♦ మెఱుఁగకుండ
సమముగాఁ నాదరించెడి ♦ సదయురాలు !
దిక్కులేమి నల్లాడెడు ♦ ఘక్కిఁజూచి !
మిన్నకుండెదవేమి స్వా ♦ మీ ! రమేశ.

కొండప్పా ! ఇంకా జానకమ్మగారచటనే యున్నదా ? ఎవ, రును వచ్చి ఆదరించి తోడ్కొని పోలేదా !

కొండ—ఆదరించ కేమిటెండి. ఈచంగతంతా మీ భార్యగా రిందంట. వచ్చి తీస్కెళ్లిందండి. స్వామీ ! అంతా గొడ్డుమోతోళ్ళంటా రండి ? ఇదంతా నండి దాయాదాళ్లు చేయించారంటండి. పుణ్యా రడ్డది స్త్రీరంతాను.

మాధ—కొండా ! ఇంత పిచ్చివాఁడవేమిరా ?

గీ. ఐకమత్యమె యున్న, దా ♦ యాదులందు
ద్వేషభావంబె లేకున్న ♦ దేశమందు

గాత్రమతకక్షు లేకున్న ♦ క్షణికమందు
రాక యుండున మనకు ♦ స్వరాజ్యపదవి.

మఱియు,

గీ. త్రాగుఁబోతు దనంబు, జూ ♦ దంబుఁ, గూట
సాక్ష్యము, లన్యాయయును, వ్యభి ♦ చారతనము
చౌర్యము లివన్నియును మానఁ ♦ జాలిరేని
కలుగవిక్కట్లు భారత ♦ ఖండమునకు.

కొండప్పా! నాతోఁగూడ రారా!

కొండ—చిత్తము. నడవండి.

మాధ—ఓ పరమాత్ముఁడా! వాసుదేవా!

సీ. ధర్మమందాసక్తి ♦ తగ్గిపోయెను జీవ
హింసయందాసక్తి ♦ హెచ్చిపోయె
సూనృతంబు నశించె ♦ కుంటలు హెచ్చరి
మతదూషణంబు సం ♦ తతము మీఱె
కులగౌరవంబులు ♦ కూలిపోవుచునుండె
కూటసాక్ష్యంబుల ♦ పాలు హెచ్చె
మద్యపానోద్యోగ ♦ మహిమ పెంపొందుచు
నుండె నోఁటిశ్వితో ♦ నిండె జగతి
నావివరుసలు వమ్మయ్యె ♦ దేవ! నీదు
పూజలు నశించె భరతోర్వి ♦ పూర్వయశము
బూదిపాలయ్యె మాకు ది ♦ క్కేది యింక
నీవగాక దయామయా! నీరజాక్ష.

దేవా! వాసుదేవా! దారిద్ర్యపాతావరణమునఁ జిక్కి విల
పించు భారతీయుల నుద్ధరింపుము, ఉద్ధరింపుము, ఉద్ధరింపుము.

(అని యిద్దరు నిష్క్రమింతురు).

మోహమువాయునంతటి దుర్దశ నాకు గల్పింతువు? దయామయా! గతజలసేతు బంధమునకై వగవనే? అతిసుకుమార జీవితంబును గడు పవర్ధింపనే? ఆర్యమత సాంప్రదాయ విరుద్ధంబీ సురాపానీయమని, భారతజాతి కగౌరవమని, అగ్రవర్ణంబునందు దలవంపని, నామనోహ రుని యంతరాత్మం బ్రవేశించి ప్రబోధించి సన్మార్గశీలునిం గావించి యగ్నిసాక్షిగఁ బరిణయంబై, స్వకులధర్మంబుల పాటించుచుఁ, బతిసేవ నే మహా భాగ్యంబని విశ్వసించుచు, వానితోడిదియో లోకంబని గట్టిగా ముడివైచుకొని జరించునన్ను నాపెనిమిటి యనురాగమునకు- వాని నయకుఁ బాత్రురాలనుగ నొనర్చి యుద్ధరింపు మంటిని. కరుణా మయా! ద్రౌపదీ మానసంరక్షణాది ఘనకార్యంబు లొనర్చిననాఁడవు నీకీ కార్యంబొక్క లెక్కయా! నావలననే యపరాధమును గనిపెట్టి నన్నీ విధిగా సిప్పెట్టెదవు చూడు.

ఉ. ధాన్యపు రాసులెల్ల వెల ♦ దారగృహంబునఁ జేర్చునాఁడు తా
మాన్యము వ్రాయునాఁడుపది ♦ మందినిగూర్చుకఁ ద్రాగునాఁడుఁ గా
ఠిన్యముఁబూని నాపయి శ ♦ ఠించిననాఁడు హృదీశుఁడన్న నే
నన్యముగాఁ దలంచనుగ ♦ దా! జగదీశ్వర నీవెఱుంగవే.

అక్కటా! జీవితేశ్వరా! మీకింతటి సాంధ్యమేల? ఇంత ఘోరకలిగా వర్ణంబునందును లేదే. చేతనింత ద్రవ్యమున్నంత వఱకు బ్రాందితాగితిరి. కలిగిన మాన్యంబుల నెల్ల వేశ్యకు ధారపోసితిరి. అప్పుతెచ్చి పప్పుకూడన్నటుల ఋణములఁ జేయుచు సారాయము త్రాగుచుంటిరి. అయ్యో! చివఱకు మద్యమా! ఆహా! ఏమి విప రీతము. పోనిండు. ఏ వ్యవహారము లెట్లున్నను యింటికి వచ్చి భోజ నముఁ జేయుటకైనఁ దీఱిక యుండదా! ఓ మనోహరా! మీ రాక కొఱకుఁ దపించుచున్న యీ దీనురాలి యెడల మీకింతవఱకు యీ షణ్మాత్రమేనియు జాలి జనింపకుండుట నా పాపపరిపాకఫలంబుగాక వేఱేముండును.

ఓ ప్రాణపతీ. ఎందుంటివో గదా ! కడుపున కింత యన్న మైనఁ దినుచుంటివో లేదో గదా ! పరుండుటకైన నావేశ్యాగృహం బునఁ దావొసఁగుచున్నదో లేదో గదా ! వట్టి మాట. చేర్చదు. చేర్చదు,

గీ. మేడలోఁ దూఁగుటుయ్యాల ♦ మీఁదఁ జేరి
హాయిగా నిద్రపోయెడు ♦ ప్రాప్తి కలుగఁ
గాను లేనట్టి నాపతి ♦ గతికి జాలిఁ
జెందివిశ్వాసమున నింటఁ ♦ జిక్కునోకొ.

గీ. ,, నెమ్మి తెమ్మన్న రీతినిఁ దెచ్చియిచ్చి
సర్వమును గూర్చె నేని వి ♦ శ్వాసమింత
యేని లేకుండ గౌరవ ♦ హీనుని బలెఁ
జూచె నా కాంత యిదిగామి ♦ చోద్యముగద.

అని వారము దినముల క్రిందట వాక్రుచ్చిన ప్రాణేశ్వరుఁడా గుమ్మమింకఁ ద్రొక్కునా ? గోత్రయ్యశెట్టి యింతటి పనికి దొర కొనెనని పాపమాయనకుఁ దెలిసెనో లేదో ! తెలిసిమాత్రమేమి చేయఁగలఁడు ? పాపము మాపాలిఁట భగవంతునివలె మాధవరావు గారింత సాయమొనర్చకున్న గతి యేమై యుండునో ! ఓ తల్లీ ! భార తాంబా ! ఒక్క సంసారం బిటుల ఛిద్రంబయినందులకే వేఱుగతిఁ గానక యిట్లల్లాడుచుంటిమి. కోట్లకొలఁదిగఁ బుత్రులఁ గనిన నీవు యిట్టిమాధ్యులఁ గనినందుల కెంత సంతాప పడుచుంటివో ! ఏమని బొఁగలుచుంటివో ! ఏవిధంబుగ గుండె రాయి చేసుకొంటివో గదా. అమ్మా.

ఉ, రాళ్ళను రువ్వఁబూనుట దు ♦ రంతగుణై మితిమీరి త్రాగి యం
గళ్ళను గొల్లకొట్టుట వి ♦ కా వికనవ్వుట దొల్లదోపుగా
బళ్ళను సడ్డగించుట స్వ ♦ భావము తానటుఁ జేయుత్రాగుటం
గళ్ల వినాశమొన్నఁడు జ ♦ గస్థలిఁగల్గునా భారతాంబరో.

ఏది యెట్లుల నూడ్చి పెట్టుకొనిపోయినను యిప్పుడేని నీ నీచవృత్తిని విసర్జించుదమన్న యాలోచనము లేక పోవుట నా ప్రారబ్ధము గాక మఱేమగును. ఆహా! ఈ నా శరీరమును జూచుకొని యేమని విలపింతును,

సీ. అదిలేదు యిదిలేద ♦ టంచుఁ జెల్పఁగఁబోవ
మూలగోఁకలిఁ దెచ్చి ♦ మోదుచుండు
వస్త్రహీనఁగనుండి ♦ వసనముల్ దెమ్మనఁ
జేపచువ్వతో పీవు ♦ జెల్లఁగొట్టు
సంసారమందు ల ♦ క్ష్యముఁ జూపుమని వేడఁ
జీపురుకట్టతోఁ ♦ జెండుచుండు
మాయత్రాగుడు జేని ♦ మానుఁడీయని జెల్ప
బండబూతులఁదిట్టు ♦ చుండునకట
గీ. అగ్రవంశాన జన్మంబు ♦ నంది యిట్టి
హేయవృత్తికిఁ దాఁగొని ♦ యిన్నిగతుల
జెట్టలను బెట్టుచున్న దు ♦ శ్శీలుఁడైన
పతిగతిని గూర్చి యెంతగా ♦ వగచుదాన.

మాధ—(ప్రవేసించి) అమ్మా! జానకమ్మా! ఇక్కడ నొంటరిగ నేమిచేయుచుంటివమ్మా!

జాన—(కన్నులఁ దుడుచుకొని) అయ్యో! ఊరకనే కూర్చుంటిని

మాధ—విచారపడుచున్నట్లున్నావే?

జాన—విచార మెందులకు?

మాధ—జానకమ్మా! నీ విచారమే నెఱుంగనిది గాదమ్మా! అయినను మనమేమి చేయఁగలము? చెప్పవలసినంత చెప్పి చూచితిని. వినఁడయ్యె నీఁడు మిక్కిలి క్రొత్త ముప్పొకటి దెచ్చి నెత్తిని బెట్టుకొనియె.

జాన— అయ్యో! ఏమది.

మాధ— (తనలో) ఈవార్తవిన్న మాత్ర విచారపడునేమో! అట్లను
కొని యూరడిల్లు టెట్లు? (ప్రకాశముగా) తల్లీ! జానకమ్మా!
బారిస్టర్ శెట్టి యిల్లువప్పగింత పెట్టుకొని కాపురమున్న వార్త
నెఱుంగుదు కాంబోలు. నీవాయింటనే గలవనియు నిద్రించుచుంటి
వేమో యనియు గడియకన్నంబున్నైచి లోనికిం బ్రవేశించి
యాతని భార్య మెడలోని యాభరణములు లాగుచుండ నామె
మేల్కాంచి కేకలు వేయుసరికిం బెనిమిటి లేచి పట్టుకొని రక్షక
భటులవశ మొనర్చెనట

జాన— (గుండెలు బాదుకొని యేడ్చుచు) అహా! మనోహరా! చివఱకు
మీకీ దుర్బుద్ధికూడ బుట్టినదా?

గీ. కుడువ గూటికిం గట్టంగ ♦ గుడ్డకును బ
రుంట మంచంబునకు నిలు ♦ చుంటకిల్లు
లేకపోయినఁగాని యీ ♦ లీల దొంగ
తనమునకుఁ బాల్పడుట మీకు ♦ ధర్మమగునె.

అయ్యో, యింతగనుకనిట్టి యకార్యంబు లెఱుంగరే. మీరు
హస్తంబులకు సంకెళ్లం దగిలించుకొనియూరేగి బంధనాలయంబున
బరగుచుండ నేరీతిఁజూడఁగల్గుదాము? హా! ప్రాణపతీ! చివర కీతల
వంపు కార్యముఁగూడఁ జేసితిరే! నాకడకేవచ్చియడిగిన బసుపుకొమ్మ
గట్టుకొనియైన నిమ్మంగళసూత్రంబిచ్చియుందునే. ఇప్పుడింకేదిగతి.

మాధ.. అమ్మా! విచారపడకుము. జానకమ్మా! నీపెనిమిటికివచ్చిన
భయములేదు. నీభర్తనుగూర్చినవిచారము నాకుమాత్రములేదా?
కర్మానుభవము నెవ్వరుతప్పించఁగలరు?

జాన... ఆప్తబంధువులైన మీకుఁగూడ విచారముండుట స్వాభావిక
మేగదా, కాదనియనఁగలనా? కాని!

మ. సుతులున్నారని సంతసింపవలెనో ♦ శోకింపకుండంగ నా
పతిసాన్నిధ్యమునందునుంటి నిఁక లో ♦ పంబేమిలేదంచు సం
తతమాహ్లాదముఁ జెందుచుండవలెనో ♦ దైవంబుమన్నించి నా
స్థితివీక్షించి సహాయుఁడయ్యెనని నా ♦ చిత్తానరంజిల్లెదో.

ఏవిధి ధైర్యంబుగ నుండఁగల్గుదును. దేవా! ఈస్థితియందు ఆపదుద్ధారకులై ప్రాణసంరక్షణ మొనర్చుచుండిరిగదాయని యీమాత్రముగనైన జీవచ్ఛవంబనై యుంటిని. లేకున్న యీవరకే యేనుయియో గోయియో చూచుకొనియుందునుగదా!

ఉ. వావికి బావలయ్యు నిట ♦ వచ్చినదాదిగఁ బితృతుల్యులై
దేవ! భవత్కృపారసము ♦ దివ్యమతిన్ గనఁ జేసి శోకపా
ళ్లీవియుఁగల్గకుండ భరి ♦ యించిన మీసుగుణప్రవృత్తి కే
నేవిధినాత్మయందు స్మరి ♦ యించెదనో ఆహరిసాక్షియయ్యెడున్.

అట్టి యాదరణమే నాయందిప్పుడు గూడనుంచి, సిగ్గువిడచి, మీ నేత్రములయెదుట నీ విధి కన్నీరు మున్నీరుగా విలపించుచున్న నాదీనగతిని చూచుచు నొక్కపరి నాభర్తను కన్నులకుఁ గాన్పింపఁజేయుఁడు. మీపాదంబుల ముట్టి వేడుచుంటినని యనుకొని యాదరింపుఁడు. మీరును జూచుచునే యున్నారుగదా! ఇంతి హైన్యదశయందున్నను దాయాదులు జూపుచున్న మాత్సర్యము! ఇదియంతయు వారి పన్నాగమే గదా.

మాధ—తల్లీ! అదిగో పెట్టె. ఒక పొనర్చునదేమి? దైవవంచన వలనమనుజుఁడు లొంగునేగాని మనుజవంచన మనుజుని నేమియుఁ జేయఁజాలదమ్మా!

గీ. మనకు దినములు చెడ్డవే ♦ టను నితరుల
దూషణ మొనర్చుటలు గొప్ప ♦ దోషమమ్మ
కాలమెప్పుడే యేరీతిఁ ♦ గడువఁగలదొ
తెలియఁగారాదు సుమి బ్రహ్మ ♦ దేవునకును.

నీ భర్తను నీ కన్నుల కగుపఱచుట లోక గొప్పకార్యము కాదు. ఇప్పటికాలపు కావలిభటుల నేమూలమునన్నైనఁ దృష్టిపరచి జూచిరావచ్చును. కావున విచారపడక ధైర్యమవలంబించి లోనికిఁ బోవుదము రమ్ము. భోజనమువేళ కాలేదా?

జాన — రాకేమిచేయుదును?

సీ. మూర్ఖుఁడైన భర్త యారీతి • భోజనంబు
మాటరాఁ జూచుకొనకుండ • మసలుచుండ
పాపినై పాడు పొట్టకు • ప్రాణమింత
పోసి బ్రతుకుచు నున్నాను • బుద్ధిలేక.

మాధ — అబ్బా! అవన్నియు మఱచిపొమ్ము — పెందలకడ భోజనముఁజేసి పోయి వానిని చూచివత్తము. రమ్ము—

జాన — చిత్తము.

(అని నిష్క్రమింతురు.)

---

శ్రీ

# సురానంద



## షష్ఠాంకము.



### చెఱసాల.

సురా—(స్వగతము) అక్కటా! ఎంత విపరీతదశకుఁ బాల్పడితిని?

గీ. నల్వురును ఛీయటంచును ♦ నాకునోట
గడ్డి పెట్టినఁగాని ల ♦ క్ష్యంబు లేకఁ
ద్రాగి, వేశ్యాగృహంబుల ♦ కేగి వట్టి
దేబ నైపోతి నా తెల్వి ♦ యెల్ల వాఱ.

గీ. బ్రాహ్మణాన్వయమున జన్మఁ ♦ బడసి యార్య
కులపుధర్మంబు లన్నియుఁ ♦ గూలఁ ద్రోసి
హీనవృత్తికిఁ దార్కొని ♦ యీవిధాన
పాతకుఁడనైతి చెఱఁగోనఁ ♦ బడితిఁ దుదకు,

గీ. సర్వమును క్షౌరమయ్యె య ♦ శంబుపోయె
బందుగులయందు నిందల ♦ బడఁగనయ్యె
చదువుకొన్నట్టి చదువు నా ♦ శంబునయ్యె
చివఱకీరీతిఁ జెరసాలఁ ♦ జేరనయ్యె.

గీ. ఎట్టుల నాపాలఁబడెనో యా ♦ కుటిలచరితుఁ
డైన గిరిమూర్తిగాఁడిది ♦ యలవడంగఁ
జేసి తాఁ జెడుటయెగాకఁ ♦ జెఱచె నన్నుఁ
గూడ నీతిరీతిఁ దప్పుచు ♦ న్నాఁడఁ దుదకు.

ఛీ! ఛీ! ఒకరిని నిందింపనేల?

గీ. తుచ్ఛుఁడా బ్రాగుడందు దు ♦ రేచ్ఛఁ గలిగి!
హైన్యజీవితమును గద్పు ♦ మంచు నుదుట
స్పష్టముగ మూఁడు పంక్తులు ♦ బ్రహ్మవ్రాయఁ
బరుల నిందించినందున ♦ ఫలమ దేమి!

అయ్యో! నా యీగతిని విని నా సతీమణి యెంత విలపిం
చుచున్నదో గదా! హా! సుందరీమణీ!

చ. అలిగి యెటులుంగ వెన్నఁడు న ♦ హర్నిశలుల్ జెడఁద్రాగుచున్న రో
వెలఁదికి జిక్కి నాదగు వి ♦ వేకముఁ గోల్పడియున్నఁగాని లోఁ
దలకవు కోపభావమునఁ ♦ దప్పుడు కూఁతలఁగూయుచున్న నో
కలికి! వివేకశీల! నిను ♦ గాంచఁగ మోము లెత్తువాఁడనో.

బంట్రో — ఏమివయ్యా! ఘుష్పిడా చేస్తాయ్ నీకి ఖడ్యాపిండా తాగే
టప్పుడ్ హోష్లు తెల్యా లేదువుంది. నీః మాటసేయ్యా కూకో
నాకి తంటాల్ తెస్తాది:—

సురా — సాహెబూ! నన్నింనులకు వెక్కిరింతువు జూఁడు!

గీ. తాగినని నోళ్లుఁదలియకఁ ♦ దండనాల
నాడితిని విధులందు గొ ♦ ల్లాడినాఁడఁ
దగనిశాస్త్రిని గంటి దు ♦ ర్గమదురంత
కార్యమొనరించి చెఱయందుఁ ♦ గాలుపెడితి.

గీ. అనుచు నేను బశ్చాత్తాప ♦ మందుచుండ
నొద్దుచుండఁగ నాయోడ్పు ♦ హెచ్చుఁజేయ
సాగినావు సలామయ్య ♦ సాహెబేంద్ర
వెక్కిరింపకు మయ్య నిన్ ♦ మ్రొక్కెదయ్య.

బంట్రో — అరే మా మాటాకి యెదిరి చేస్తావ్ ఏం ఘూచారం తల్గిం
దివోయ్. మాహిన్స్పెక్టర్ సాఫ్ ఆయేలో మాఖూదూ మేమట్టి
గోడ్తాయ్ నీకి.

సురా—అయ్యా! నేను మాట్లాడను గాని నాకొక్క సాయము మాత్రమొనర్పుము. నీమేలు మఱవను

బంట్రోతు—ఏమ్టీంవో యమ్.

సురా—గీ. ననుగురించి గుండెలు బాదు కొనుచు నవ్వ
కేనివచ్చినచో నేవి ధానవేని
నాకుఁ జూపించఁగోరుచు న్నాఁడె నిన్ను
ముట్టఁజెప్పుదురే దైవ ముగముఁ జెంది.

బంట్రోతు—దాస్కీ సామీ ఫర్వాలేదువోయమ్. నీది ప్యారీవస్తాది అంటాక్ అయి తేసరి. ఇనాం దియేతో మాదీ సామ్ పోయింది వోయమ్ ఖానీచురానందుల్! మాఖీఖురాక్ మే హల్లా సారామల్లి బరాంది యివ్వే పయేతో సువ్వార్ది ఘోస్ తిన్నహాంతవో సంవుంది హైంసాబో లేతో బొమ్మక్ వుండగ్ భ్యమ్మల్ బిల్లగోచి పట్టి ముఖాక్ బూడ్దె తల్గించి సేట్టు సెట్టిచో సత్కుతాక్ గందా! ఖంచన్కి, ఫనాకీ డబ్బుహంతా హజామత్ చేసి అయ్యా వారిలాఘా బూకుంటే పళ్యాంబిడ్డల్ సొట్టా బతా వాలా అనుకున్నావ్. హెంత మొండివి వోయమ్.

సురా—సాహెబూ! గతమును జ్ఞప్తికిఁ దెచ్చి గోల నేడ్పింతువు?

గీ. మూర్ఖుఁడను గానసే సర్వ మును వృథాగ
పాడుగావించి యీరీతి భ్రష్టుఁడ నయి
భార్య నేడ్పించుచును నింక వసుధయందు
బ్రతుకుచున్నాఁడ జీవచ్ఛ వంబ నగుచు.

అయ్యా! నాకు రాత్రి నిద్దుర లేకుంటచే బడలియున్నాఁడ. ఇంచుక విశ్రమింతును.

బంట్రోతు—అచ్ఛా! సోజాన్.

(సురానందుఁడు పరుగిడును. బంట్రోతు పహరా యిచ్చుచుం డును.)

(మాధవుఁడు జానకమ్మయుఁ బ్రవేశించును)

మాధ—అమ్మా! జానకమ్మా!

గీ. అదిగొ చెఱసాల నీవు న ♦ మ్మదిగరమ్ము
పరులుచూచిన నందుఁ గా ♦ వలెనుగాయ
వానికా మాటవచ్చును ♦ భంగమగును
మనము చూడంగవచ్చిన ♦ పనియుఁగూడ.

మఱియు నొక సంగతి.

గీ. వానిఁగని యేడ్చెదవు గుండె ♦ బాదు కొనుచు
నేడ్వఁ బోకమ్మ నినుఁజూచి ♦ యేడ్చువాఁడుఁ
గూడ నిద్రిపు నొకసారి ♦ ఘొల్లుమనిన
హానియగు నిమ్మటను దూర ♦ కమ్మ నన్ను.

జాన—ఆర్యా! అట్లనే ధైర్యమున నుందునుగాని నా హృదయేశ్వ రుఁడేఁడీ!

మాధ—అదుగో! మెల్లగఁ జూడుము.

గీ. మట్టిఁగొట్టిన యొడలితో ♦ మాసినట్టి
బట్టతో చిక్కి సగమైన ♦ పొట్టతో వి
రించి వ్రాసిన వ్రాతని ♦ లెంచు కొనుచు!
నిద్రఁ బోవుచునున్నాఁడు ♦ నేలమీఁగ.

నీ విచ్చటనే యుండుము. ముందుగ నేను వీని లోఁబఱచు కొని వానిని లేపుదును.

జాన—చిత్తము

మాధ—ఏమండీ సాహెబుగారు.

బంట్రో—క్యాహై తుమ్ గడబడ్ కర్నేకో జావ్.

మాధ—కొంచెము శాంతింపుఁడు. మీకు జీతమెంత?

బంట్రో—ఎంతా అండి. పన్నిండు రూపాయల్ యిస్తారు ఖర్వు కాలములో పిల్లల్కు మేకల్కు పెట్టాబత్కావాలా పంతుల్ సాప్ యెన్కటి రోజుల్కు రోజూడ్యైరీకి నాల్గునూసెన్సల్ రాపిస్తే ఆదా రూపాయి వస్తుండింది. ఇప్డూ దేషం అంతా తెగ్లిమీరింది ఘుటాక్దిగ్దు.

మాధ—నాకొక సాయము వర్సవలయును (అని చేతిలో నేదియో పెట్టుచు) సాహెబూ! ఈ బిడ మా మఱఁదలు సురానందుని భార్య. ఈతని మసిలినిగూర్చివిని ధైర్యమును జిక్కఁ బట్టలేక చూచి పోవుదమన్న భ్రాంతిచే నిటు వచ్చినది. దయపుంచి యించుక తడవు మాట్లాడనిమ్ము.

బంట్రో—మా ఫోలీసువా డుండాడూ లేదు ఆడిక్ ఘూంచెం ఘాబ్రాచేస్తాడ్ గాని అది ఖాస్త చేతిలో దాలేతూ ఆకుటుల్ గీకుటుల్ అన్ని సఫాయి చేస్తాది. మీకీమాట నేస్కుంట మాకపోయింది లేదు. జాన పర్వాన్లై.

మాధ—అయ్యా! నీవు కడు మంచివాఁడవు. పిల్లలు గన్నవానికి జాలి యుండదా! (తనలో) ధనములోనున్న మహత్తు మఱియొక దాని యందు లేదుగదా!

గీ. కఠినునైనను తృటిలోనఁ ♦ గరఁగఁ జేసి
రాజ శాసనములను ది ♦ రస్కరించి
తగిన స్వాతంత్ర్యమును దార్చి ♦ తప్పుదారి
యందుఁ ద్రొక్కించుమాహాత్మ్య ♦ మందుఁగలదు.

(కొట్టువద్దకుఁ జోయి) సురానందా!

సురా—(లేచి మాధవుని జూచి మరలఁ బరుండి ఏడ్చుచుండును).

మాధ—సురానందా! లెమ్ము. ఏడ్వకుము. కర్మానుభవమున కేడ్చుటందులకు?

సురా—

మ. హితవాక్యంబుల నెన్ని తెల్పినను నే ♦ నింతేని నాలింపకే
గతి ముప్పుం గొని తెచ్చుకొంటిని యప ♦ ఖ్యాతిన్ దలన్ దాల్చితిన్
పతితుండన్ శిరమెట్టు లెత్తఁగఁగుదాన్ ♦ భవ్యాత్మకా! పాపసం
గతులన్ మున్గి చరించు నట్టి ఫలమున్ ♦ గంటిన్ సుమీ! నేటితో

మాధ— తమ్ముఁడా! విచారింపకుము. నిన్నుఁ జూచి పోవలయునని వచ్చిన యీ నీభార్యారత్నమును నొక్కతూరిఁ గల యెత్తి చూడుము.

సురా— అన్నా! చూడఁజాలఁ జూడఁజాలను. తుచ్ఛుఁడనై పాపభీతి వర్జించి సుకుమారమైన శరీరమును బేపచువ్వలతో వెదురుకఱ్ఱలతో రోఁకళ్ళతో నరచేతులతో మర్దించిన పాపాత్ముఁడను. వివాహకాలమునఁ బుట్టింటివారు పెట్టిన వస్తువులను గూడ నొలుచుకొని పోయినప్పుడుఁ గూడఁ గల్లెత్తు మాటాడి యెఱుంగని సుగుణాలలామను బలు తెఱంగుల నేడ్పించిన క్రూరకర్ముఁడను. కాలాతీతమై యింటికిఁ జేరినను అంతవఱకుఁ గుక్కెడు నీరమైన బుచ్చుకొనక మదీయరాకకు నిరీక్షించుచు గొనగొనలు విసవిసలు లేక సకలోపచారము లొనర్చి యాదరించిన పరమసాధ్విని గోల పెట్టిన తుచ్ఛుఁడను. నా యీదీనావస్థను జూచి యోర్వఁజాలకఁ బుట్టింటివారు తీసుకొని పోవవచ్చినను నాకు భర్త తోడిదిగే లోకంబుగాన నేను రానని నిర్భయంబుగ శగించి ప్రత్యుత్తర మిచ్చిన మానవతీలలామను బాధించిన ఛండాలుఁడను. ఒక్కనాఁడేని ముచ్చటికేని యొక్క చీరనేనిఁ దెచ్చుట లేకపోఁగా మీఁదు మిక్కిలి వగ్గని కాళ్ళపైఁబడి ప్రాల్మాలుచుండ వెనుకకు నెట్టి పెట్టెలందునఁ గలట్టి విలువఁగల కోకల నెత్తుకొని పోయినప్పుడైనను మొగము మాడ్చుకొని యెఱుంగని ధర్మపత్నిని నిర్దయుండనై బండ బూతులఁ దిట్టిన చెనఁటిని. ఇంటిలో నున్న

దియు లేనిదియు నొక్క నాడేని విచారించుట లేక పోఁగా వెళ్లు
సరికి సిద్ధంబుగ నన్నంబు బెట్టలేదని చావమోఁది మానుష
మునకు భ్రష్టఁ జేసి ఆ విధంబుగఁ గాలంబుఁ గడ
పిన యర్ధాంగ లక్ష్మిని యధ్యాన్నగతిని నాదరించిన యధ
మాధముఁడను. ఇట్టి యకార్యంబు లొనర్చుచున్నను నాపై
నీగవాలినంతనే ప్రపంచంబు మునిఁగిపోయిన రీతిఁ బరితపించు
ప్రాణేశ్వరిని పరితాపపఱచిన పాతకుఁడను. కాపురమునకు వచ్చి
నది మొదలు నేటిదనుక సాటివారిలో ఫలాని వారి కోడలు
గాదా యని యనిపించుకొన్న సాధ్వీలలామను సకలకీతుల రొష్టు
పెట్టిన కఠినాత్ముఁడను ఇంటికిఁ బదిమంది స్నేహితులను రప్పించి
వారితోఁగూడి చెడఁద్రాగి లోపలినుండి యదియు నిదియుఁ
దెమ్మని సిగ్గుపడినపుడు, ఆ దుండగీయుల మధ్యకు, ఆ తుచ్ఛుల
మధ్యకు, ఆ త్రాగుబోతుల మధ్యకు నీడ్చుకొనివచ్చి మదీయ
క్రోధానల తీవ్రమును జూపించుచు జుట్టుపట్టి యీడ్చుకొని వచ్చి
యమ్మానవతీ లలామచే సకలోపచారములఁ జేయించి హింస
పెట్టిన కలుషాత్ముడను. నేను త్రాగునదిగాక నా యింతిని
త్రాగుమని నిర్బంధించినపుడు " నాధా! ఇది హైందవాంగనలకు
విరుద్ధ సాంప్రదాయము సకల పాపాకరంబగు నీ దురంతకార్య
మును నాచే నేలఁ జేయించెదరు. మీ పూనిక నిరాకరించినందు
లకుతుమింపుఁడని'' కాళ్లఁ వ్రేళ్ళబడి ప్రాల్మాలినపుడు నిర్దయుండనై
హింసించి బలవంతమున నా పతివ్రతాలలామచేఁ ద్రాగించిన
మూర్ఖుఁడను. అట్టి కొంపను ఋణస్థులు వచ్చి స్వాధీన పరచు
కొన్నను వచ్చి సతీమణిని సరియగు స్థితియందుంచుటకైనఁ బూను
కొనకఁ ద్రాగి తందనాల నాడుచుండుటయే గాక ఆ యింటిలో
నున్నది నా సాధ్వియే యనుకొని కడకు మాంగల్యమును గూడ
నూడలాగఁబోయి యీవిధి రవ్వఁదెచ్చుకొన్న యీ పాపాత్ముఁడి

యందు దయఁబూని చూడవచ్చిన సద్గుణరాసిని సిగ్గులేక, పాప
భీతిలేకఁ జూడలేకున్న కనుఁడను. అట్టివాఁడను అట్టి యధముఁ
డను జేయుటకు సంకల్పించి కౌగిలించుకొని తగుననియు మొగముఁ
బెట్టుకొని చూచుటను చూడఁజాల. చూడఁజాల.

గీ. ప్రబలికయున్నను వచ్చిన ♦ వానిపోల్కి
జూచుకొని యిట్టి ఖలుని, యీ ♦ నీచునైన
నాశక్యజనుఁ జుకొని మూర ♦ లరుగఁజేయ్య
సాయుధ్యా చూచుననేఁ జూడఁ ♦ జాలఁగాను

జాన—ప్రాణేశ్వరా! జరిగినదేదో జరిగినది. దాని విచారించిన
లాభమేమి? మగవాండ్రైన వారికెల్ల నిట్టి చింతలు వచ్చుదాన
నైన నేనేనేని ధైర్యముఁ జిక్కఁబట్టఁ గలను. చెప్పుఁడు.

సుం—ఓ కాంతామణీ! నన్నింకఁ బ్రాణేశ్వరా యని పిలవకుము.

గీ. పరమసాధ్వివి నీదివ్య ♦ వక్త్రంబు
వెగటు కలిగించి యెపుడును నీ ♦ మొగము జూసి
గని పలుకరించ నిట్టి యీ ♦ చెనటి నీకు
బ్రాణనాథుఁడ నెపాటి ♦ యమునుఁడను గాక.

ఎవంతనీచుని ప్రాణేశ్వరుఁడని నెంచుకొంటివి దానివలన
నీకు ఫలితమేమి?

గీ. ఈ రాధవమును దాటి ♦ యింక నేను
పుడమిపైఁ గాలు పెట్టిన ♦ పుట్టినదా త
దీయ ప్రాణేశ్వరునిఁ గాను ♦ తలియఁగలను
కాంత నేటికిఁ గొంకక ♦ యంతదాక.

జాన—నాథా! అశ్లీలంబులు పల్కి నన్ను మఱింత వ్యాకుల పరచుట
మీకు భవ్యంబగునా.

గీ. నగలు నాసొంబు లేమిచో యి ♦ నను వగవను
గృహము ఋణదాతపాలైన ♦ నేడ్వఁబోను

భూములారీతిఁ బోయిన ♦ బోగలేదు
మీరలు సుఖానసుంట నే ♦ కోరుకొందు.

దేవా! జరిగిన లోపమును మీయన్నగా రెట్టిలో తంటాలు పడి సర్దెదనని వాగ్దత్త మొసర్చియున్నారు. త్వరలో విముక్తులగు మార్గమును వారు జూతురు. కాన యింక నేని

సురా—(అర్ధోక్తిలో) దేవీ! జరిగినదానికిఁ జచ్చినట్లు పడియుండుట మాని యింకమీఁదఁ గూడనా? (చెంపలు వాయించుకొనుచు) అన్నా! మాధవా! బుద్ధివచ్చినది.

గీ. జుట్టుగొరిగించి సున్నపు ♦ బొట్టుఁబెట్టి
గాడ్దెపైనన్ను నెక్కించి ♦ గ్రామమంతఁ
ద్రిప్పఁడారీతినిఁ కమీఁదఁ ♦ దిరుగుదేని
నన్నుఁగాపాడుమయ్యయో ♦ యన్నయిపుడు.

మఱియు:—

సీ. త్రాగఁబోయిన నింకఁ ♦ దల్లితో సాంగత్య
మొనరించినట్లిదే ♦ యొట్టు సుమ్ము
సాని సంపర్కకాం ♦ క్షను బోతినాయింక
భార్య సూత్రము తెగి ♦ పడినయట్లు
సంగ్రహణార్థము ♦ జనితినా యింకనా
చెల్లెలితోఁ బొందు ♦ చేసినట్లు
దుండగపుం జట్టు ♦ తోఁగూడి పోతినా
యక్క సంపర్కమే ♦ నందినట్లు.
గాన నన్నునమ్మి యీయప ♦ ఖ్యాతిఁబాపి
నన్నునాభార్యతోఁ జేర్చి ♦ నాకిఁకేని
జీవనాధార మొక్కండు ♦ జేసిమఱల
మంచివాఁ డనిపించి ర ♦ క్షించుమయ్య.

మాధ—తమ్ముఁడా! నేఁటికీ యపభ్రంశపు మాటలు? భయము లేదు, కాపాడెదను.

సురా—అన్నా! మాధవరాయ

గీ. నాఁడు గన్నడి హితముల ♦ నచ్చఁజెప్ప
వినక దూరిన పల్కుల ♦ మనమునందు
నుంచుకొనకయ్య నన్ను మ ♦ న్నించునటులు
భారమిఁక నీదె నా నమ ♦ స్కారమయ్య.

మాధవా! నేను వచ్చువఱకు సతీమణి నెల్లఁ గాపాడుమో.

గీ. భాగ్యములకయి నేడ్వని ♦ యోగ్యురాలు
పరుషవాక్య మాడని యట్టి ♦ భవ్యురాలు
నాఁడు యిల్లాలు దీనినీ ♦ నాల్గునాళ్ళు
గరుణఁ గాపాడుమయ్య దుః ♦ ఖమునుమాన్ప

మాధ—తమ్ముఁడా! పవిత్ర చరిత్రుల నెవరు గాపాడ వలయును! వారి సుగుణములఁ జూచి, వారివినయసంపదలఁ గాంచి, వారిభక్తి ప్రపత్తుల నవలోకించి, వారి ధర్మములఁ బరికించి, వారి పాలిఁట సదా భగవంతుఁడే కరుణాళుఁడై యుండఁగలఁడు. నీవు విచారపడకుము. మేము పోయివచ్చెదము.

సురా. ప్రేయసీ వెడలెదవా?

గీ. ఈఁగతిఁ జరించె పతియని ♦ నెదఁదలంచి
దుఃఖపడకు మనంబునఁ ♦ తోయజాక్షి
అన్నగారి కంతటి కృప ♦ యున్నయెడల
వైళమే నిన్ను కలసెదు ♦ వాంఛ సాధ్వి.

అన్నా! ఈ అపవిత్రమగు స్థలమునందు, దోమకాటులమధ్య నిలువలేకుంటిని. చూచుటకై వచ్చిపోవుచున్న వారిమోముల జూడఁ జాలకుంటిని. ఈ దుర్భర పరిభవానలంబున మ్రగ్గుచున్నవాఁడ నగుట

చేసి నిన్నీహారంబు లెట్టివియో మఱచి యుంటిని. నన్నీ యాపద నుండి యుద్ధరించితిరి యోసి మఱల నీయపవర్గ మార్గంబునఁ జొరకుండ జీవింతును. నీ పాదమాన. ఏమాత్రమును సుస్తి చేయకు సుమీ.

బంట్రో— అన్గోనయ్యా! ఘంటాయిస్తాఁవుంది ఇనస్పెక్టర్ సాప్ ఉండాగ్ మాకీ తంటాల్ తెస్తారు పోండి, పోండి.

మాధ— తమ్ముఁడా! నీ వీబట్టలను నీవద్ద నుంచుకొనుము. ఆ మాసిన బట్టల మా కిమ్ము.

(అట్లు చేయును.)

మేమింక పోయి వత్తుము.

సురా. మంచిది పోయిరండు.

(అందరు నిష్క్రమింతురు)

---

శ్రీ

# సురానంద.



## సప్తమాంకము.



(ప్రవేశము గురవఁడు, వెంకన్న)

గుర—సేఁరా! యంకన్నా! మరి యిత్తూర్యాల కరుసంతా నీదీ నంటి యిగందా! యింకా ఆ యవారమే లేదాగే ఏందోయి కమాం మీసు.

వెంక—మరిసి పోలేదనే. యింటిమకర మొగ్గసికి పారనూకినా ఛాత్తు స్లిగారోం కాయనట్టు కెల్తా ననాన్నఁడు. ఆమూరానొత్తాఁడేమో అని యెగురు సూత్తున్నా.

గుర—యింకాఫున్నా యంటార్రి మకరలు

వెంక—లేవంట్రామరి. నంజముండనుపుట్టింటి కాడ్కి. తరిమేసినానా? నాటిప్రొద్దునుఁచి మనవెవారం నాచామిరంగా యెట్టావుంట మంటే అట్లావుందిరా!

గుర—యదవ నాగన్నా! యిదేందోయ్ పెల్లాన్ని తరిమినోణ్ణినిన్నే సూసినా! నేఁనే లకింటికెల్లినా యింత బువ్వన్నా యెట్టదంట్రా

(తెరలో)

యెలిగిందాలా మటము మాది ♦ రామగురుఁడు సీతారాం
జగజ్జోతి యెలిగించాలి ♦ రామగురుఁడు సీతారాం

దొంగబావాజి—(ప్రవేసించి) పిల్లలు మేకలు సలగుంజాలి రామగురుడు సీతారామం,

గుర—ఏవోరోసి ఏది.

బావా— జయసీతారాం మాది యెడ్లారామదాసు గారి మటము. సీతారాం బిక్షాటనం చేస్కుంటూ యిట్లా బయలుదేరు తాం.

వెంక— గురవన్నా! బావాజీలు పెశనలు చెపుతారంటారు. పోస్తం చూస్తానంటారు మటి యీయన కాడనుంచి కల్లువానవొస్తుంది. మనలాంటి యవారమేనా గేంది.

గుర— ఏదో సోదుత్తారుగాని ఓయి యిదిగోనయ్యోయి నీవు బావాజీలయితే దమ్మేత్తావా? మటి ఏదురొమ్ముకాడనుండి ఆరతి కప్పూరం శొంఠిపొడుము కుంకం పసుపు యియిన్ని తీత్తావా? యెంకాసేయి చూచి శక్రాలు సెప్తావా?

బావా— రాం రాం. ఏగోచూస్తాం మీ వ్యవహారానికి మీరుపొండి.

గుర— నువ్వు మాబుద్ధిమంతుడల్లే వున్నావే పన మాతోపాటు కూసంతే ఉద్దువుగాని. ఆ కల్లుకొట్లో సేరితే యేడబాయింపు మీదన్నా పతిగాక్కు. చంపాయించుకోచ్చుగా.

సురా— (ప్రవేసించి తనలో) మావాళ్ళు నాకు పేరు పెట్టి సందుకు సార్థకం లేకపోతే యెట్లా! ఏటక్కు వ్యవహారం చేతనైతేనేమి బయటపడ్డా. అంత వగలేద్వేడ్సిం బెంములకంటే రిమాండులో వున్నన్నాళ్ళుగుటకదిగితే వొట్టు. ఎట్లాగా అనుకుంటే దాటుకున్నాం. ఆ చలి గూడా తీరింది. నగాలనాగయ్యా! యింకేమే దుస్తావులే. బ్రాందిసారాలుతో గుండెలుమండిపోయినాయి. బొమికలు కనబడుతూవున్నాయి. కల్లు నీళ్ళల్లోబడ్డావా? డబ్బుతక్కువ. వొంట్లో వున్న పుడుకురోగం పోతుందన్నారు. దాని కోసం దేవులాడుదామన్నా కాండబ్బు దొరక్కుండా వుంది. వుండాకోరులు. యిది మాత్రం పూరికే యిస్తున్నారు. గిరాకీ చేశారు. ముంత అణాకాని. ఈ వెధవ జంఝుం కొంప దీస్తువుంది. ఎవరెక్కడ చూచిపోతారో అని మొగాన గుడ్డడ్డము బెట్టుకొని అటు యిటు

ముందు వెనక చూచుకుంటూ ఏ కులస్థుడైనా సరే గబగబా చేతుల్లో వున్న రేక లాక్కోవడం. నాలుగు గుక్కలు పోసుకోడం. వృథాయించడంగావుంది. ఇన్ని యేమున్న లేడిస్తేనే గాని రోజు తెల్లారడంలేదు. కాళిదాసుగారంతటి వాఁడు, భార్గవుఁడంతటివాఁడు తాగేవాళ్లట మున్ను. ఏడవలేక వ్యవసాయమని యిప్పటివాళ్లకు బుట్టిందీదొమ్మ- వ్యాసులవారు కల్లు గీసేవాట్ట. తెల్లవారి పాచిమొగాన మూడు అణాల్ది ఏడిసినాగాని ఏమంత మజాగా లేదు. యెవరూ దొరికేటట్టుకూడా లేదు. ఇంటికాడ తడుముకు రావడానికి మా ఆవిడ మెళ్ళో పసుపుకొమ్ముమాత్రిమే వున్నది. వీళ్లంతా యెవళ్ళో యిక్కడ చేరారు. వీళ్ళేనా? గవళ్ల గురవఁడు. గొల్లవెంకడు. వీడొకఁడా దొంగబావాజీ.

( తై అ లో )

ఏతీఱుగ నను దయచూచెదవో ♦ యినవంశోత్తమ రామా

నాతరమా భవ చాగరమీఁదను ♦ నలిన దళేచ్ఛన రామా

కోట-(ప్రవేసించి) ఛీ రగునంకన చీతారమణా ♦ చితజనపోచక రామా

కారుణ్ణాలయ బక్తవొరద నను ♦ కన్నదె కానుపు రామా.

సురా—ఓరి నీ ముండామొయ్యా! అప్పుడే యెప్పుడు తెల్లవారిందిరా నీకు? ఏక్కడో వేశావు పద్దు.

కోట—వోరిచ్చేదేంటి? నేను జమీందారుణ్ణి, రాజుని, రాజూగీజూనాకు తెల్దే, శక్రవర్తంతోణ్ణి. నూస్కో నాదెబ్బయితే యియ్యాల కరుసంతా నాదే సరే నంటావా!

సురా—అయితే యేమంటావు.

కోట—అనేదేంటి? రా నాతో మటి సిత్తుగా యేసుకుందారి.

సురా—డబ్బులు చూపు మరి?

కోట—(నడుమున నున్న డబ్బులు కొట్టి చూపును) నూసుకో యింటిమీఁద పెంకకెక్కల్లి యూలాం పాడ్తే వచ్చాయి.

సురా—పట్టపగలే.

కోట—పట్టపగలేంటయ్యా! ఏం నాయింటికి నేను దొరను కానా? వోడి పెళ్ళాంమెళ్ళో నర్నొతెంచా నంటావా! వోరింట్ళొన్నా కన్నమేచానంటావా? అదంతా మీ బొమ్మల్కి. సెల్లుబాటు మొన్ననేగా మన యవారాలు జరిగాయి.

సురా—పోనీయరా! ఆగోడవెందుకు? వాళ్ళందరికీ శ్మశాన వైరాగ్యతత్వం చెప్పి డబాయించి తప్పించుకొని యివతిల పడ్డాను. కాని కోటన్నా ఆ నాలుగు నాళ్లు మూతిముంచాను కాదే పిచ్చియెత్తి పోయిందంటే నమ్మావు? అలవాటు కాకుండా వుండాలిగాని వదలడం చస్తేనే సుమీ? ఏమంటావు?

కోట—మరి యిప్పుడేమంటావు? పొద్దెక్కుతోంది కల్లుకు తెల్లారడం లేదు. కల్లు దుకాణం దాకా రానిత్తారంటావా? నే మ్ యేమి పెజ. తోట్లన్ని గురప్పుబళ్ళు. బయల్ దేశాని కొచ్చినట్టుగా చెంబు లెత్తుకు రావడం, యిదంతా యెందుకయ్యా? చెట్టు మీదనుంచి కిందికి రానిత్తురా అన్నట్టుగా వుందయ్యా? చంకురు మియ్య తాళ్ళమీద తాండవమాడు తుండాడంటే.

సురా—పట్టపగలు కల్లుపీళ్ళకు సానట్రా? దుకాణం అంటేగవళ్ళ సరిసి మన్నారిగుందే గనుక మనాట లెట్లావున్న పరిసిపోతూ వున్నాయి.

గుర—పంతులారిని ఆదొడ్డికాడ గడ్డివామికింద కూకోబెట్టి యెత్కొల్లి యిద్దారి.

సురా—మీకుగూడ తెలిసిందిరా! ఎవరితో అనమాకండర్రో!

గుర—అమ్మో! అనడమే. సచ్చినా మనమాటా కాడ్డోవడమే. నాలిక్కాల్సాలిగాదూ? ఆగంగానమ్మోరు చాచ్చిగా—నీపాదాల చాచ్చిగా వోర్కి తెల్నీయను. తెలిచిందంటే నాలిక కాల్చు.

మారాజా! వెంకన్నా! మరి తొందరిగెల్లి చాత్తుర్లగారి నడిగి డబ్బెత్తుకురా. అనే!

వెంక — మరి మీారంతా యిక్కడే కూకుంటారా!

సురా — ఆహా!

వెంక — మరి కూకోండి. యెల్లొత్తాను. (నిష్క్రమించును.)

సురా — గురవఁడూ! నాకెట్లా చేరుతుందిరా!

గుర — కుండతో!

సురా — కుండతోనే! పగలేనా?

గుర — అంతగా ప వరేనా సూత్తారంటే సిన్న గోనెముక్కడ్డం వేసుకోని మట్టుకొత్తా లెగుండి.

సురా — సరే. ఏదో యేడ్పేదుద్దామనుగాని కోటప్పా? నీ పాట విని చాలా కాలమయింది. రా.

కోట — మరి ఘుంటా వేంటి. సూసుకో నా తమాసా!

గురుఁడవునీవని దైవమునీవని ♦ యురుఛాత్రంబులురామా
గురుదైవంబని యెఱుఁగక తిరిగేటి ♦ ఖూరుడనైతిని రామా!
బల్ కూరుఁడనైతినిరామా! పెద్ద ♦ కూరుడనైతినిరామా!
దీ. దీ. దీ. (అని ఆటమొగలు పెట్టును.)

తాండవమున నకిలాండకోటి బెమ్మాండనాయకా రామా?
బందనమున నీనామము నమ్మిన బెమ్మానందము రామా?

ఆ రాములోరిపేరుతలిత్తే ఎంత బెమ్మానందముగా వుంటుందో నాలుగు ముంతలు కల్లు నీల్లోసుకుంటే అంతే ఆనందం — ఆ రామయ్య తండి మాకు ప్రెత్తెచ్చంగా కనిపిత్తాఁడు. చుమా!

సురా — సరేగాని కోటప్పా! యివన్నీ అమ్ముతున్నావుగదా! తరువాత యేమి చేద్దామని నీ యూాసా.

కోట — నేనా? నాకేమయ్యా! చూదర్ముండావోన్ని. చిగ్గాదిల్నా. నువ్వేం చాత్తావో చెప్పమరి సూద్దారి.

సురా --అదే తోచలేదురా !

కోట—తోచే దేంది. నరినాం చాకరోకతన్నారు. చరేనా ? అంతే
 నంటావా ? వొప్పుకో మరి.

సురా— అంటె చావమనేవా ?

కోట...సావక సేసేదేందో చెప్పరాదంటయ్యా ! నే నంటావా ?

సీ. ఉన్న దూలాలమ్మి ♦ సిన్నమకరాలమ్మి
 యింటిపై కప్పమ్మి ♦ యిటుకమ్మి పెంకమ్మి
 యింటిలో గోయెట్టి ♦ మెలంగ బెనుదు
 పాటిమున్నమ్మి నే ♦ బాగుపడుదు
 వంగతో బుట్టును ♦ గొంగూరమడి గోతు !
 ఆటినమ్ముకొని చా ♦ పాటు సేతు !
 కూలినాలిని సేసి ♦ సీలకు గడియింతు !
 అందులో చగము నా ♦ యాలికిత్తు
 అంతగాగాకపోతె నా ♦ వ్వాంత పంగ
 నామములబెట్టి జోలె చం ♦ కను గగిల్చి
 అర గారాచంబోయని పదా ♦ లాడుకొనుచు
 బయులు దేరుదు నే బయం ♦ పడనుచామి.

ఇంకనువ్వంటివా ! చంగీతాలురావు. ఛాత్రాలురావు. వైద్దీకంరాదు. వేదాలురావు. ముష్టెత్తడంరాదు. పోనీ ! చాత్తుర్లగారూ ! నాటకాల్లో సెరతావంటయ్యా ! కాదయ్యో. దేవుండా నాటకాలంటే మాటలనుకుంటుంటావా. మొన్నోపాలి సూశ్నా. ఆడగూడా పదలాడాలి. ఆటలాడాలి. బెదురుమోతు గొడ్డల్లే వుండటాని కీలా ! ఆనేచాలు. ఆబొమ్మలు. ఆ తెల్లదీపాలు. ఆదిరీసులు. యేం బాగుందయ్యా. వారేవా !

సురా—నీభార్యను పుట్టింటికంపావంటగా. నిజమేనా ?

కోట—ఆముండను తగిలేచిన కాడనుంచే నాపేనం చుకంగా వుంది.

సురా—నీవదృష్టవంతుఁడవు గనుక సుఖపడితివి. నాభార్యను వెళ్ళమంటే వెళ్ళదు గందా.

కోట—ఆమ్మో! ఆ అమ్మోరేనా కదిలేది. తెల్లారి లెగిసి ఆ తల్లి మొగం సూత్తే పాపాలన్నీ నాశనమై పోవాల్సిందేగాని చామాన్నమా. చాచ్చాతుపారతమ్మోగు. అన్నపూర్ణాదేవి. సేతులెత్తి దండమెట్టాలి. ఏంత తాగుంటేనేమయ్యా! సాకునున్నా! ఎదుటనున్నా మంచికి మంచి సెబ్రకు సెబ్ర సెప్పుకుంటారుగదా! నీపాలిటెట్టపడ్డదో మారాజా! మానుబావుఁడవు. నా యిల్లాలుందిబాబూ! ఓమాలి కోపంవచ్చి బంకుచ్చు కెంటమడితే నీ జిమ్మదియ్యా! నీ మొగాన మొద్దులెట్టాకో మని ఘంటామీద ఛడేల్ మని దెబ్బ కొట్టి తుఱ్ఱునెగిరిపోయింది. దాని తచ్చాగొయ్యా! మళ్లీ దాని మొగం చూత్తే నీ యెడంకాలి జోడు నా మొల్లో కట్టు. గుమ్మంలో కొత్తేనా నాచామిగంగా! పంబ పంబో యని యాపసువ్వ యీపుమీద మోగొద్దంటయ్యా!

(తెఱలలో వాద్యములమ్రోత)

గుర—అదేందయ్యో! చాత్తుర్లుగారూ!

(ఒకఁడువచ్చి అందరికి తలకొక కాగితమునిచ్చి పోవును.)

కోట—సూడవయ్యా చాత్తుర్లు.

సురా—(చదువును) ,, మద్యపాన నిషేధమును గూర్చి చౌకులో బహిరంగసభ జరుగునుగాన నెల్లరు విచ్చేయఁ బ్రార్థితులు. సభాకాలము సాయంకాలము. 5-30 లకు. ''

వెధవలు వీళ్లు చెప్పేవాళ్లు, మనం వినేవాళ్లమునా. వీళ్ళే మనకు దొరలల్లేవుండే.

గుర—తాగొద్దంటారేందయ్యా!

సురా—అవును.

గుర—ఆళ్ల దేంబోయిందంట.

సురా—నే ననేది అదే.

గుర—యీ సబలు చాలా నాళ్లనుంచి జరుగుతుండాయి గందా వోరన్నా మానేచారా ?

సుర—వీరి మాటలు లెక్కా ! పత్రమా ! నానుకో. అచ్చాపీచు వెన్నకు దుకానంలో.

కోట—పోసి ఆరేంచబుతారో. విందారి.

గుర—నాకూ అట్టాగే వుందిరా ?

సురా—వారుచెప్పేది నే చెబుతా వినండి. ఈపద్ధతంతా తప్పంటారు తాగవద్దంటారు. శాస్త్ర చదువుకున్నవాళ్ళు గనుక చిలువలుకు పలువలు పలువలకు చిలువలు, వన్ని కధలుగా చెబుతారు. దాన్ని పూర్వపక్షం చేద్దామని నేనుగూడా కొన్నిగ్రంధాలు చూచా. శాస్త్రేయులంతా తాగవచ్చునన్నారు. శ్లోకాలు వ్రాశారు.

గుర—నీవీ గొడవంతా యెప్పుడు నేర్చుకున్నావంట.

సురా—ఇప్పుడు శాస్త్ర యీ వ్యవహారంలో దిగిన కాడనుంచి లేదు కాని. మా ముసలాడు బాగున్నప్పుడంతా చదువుకోనడమేగా నాపని. అసలు యీ ఆధారములన్ని చూడకుండానే యిందులో దిగా ననుకున్నావా!

కోట—అట్లా అయితే ఆళ్ళమాట మనకెందుకు! సిత్తుగా తాగొచ్చు నన్నమాటే.

సురా—ఆహా! పల్లకుగా. నడిరోడ్డుమీద. కాలుమీద కాలు వేసు కొని లోటెత్తి దంచొచ్చు. అడ్డంవచ్చిన వాళ్ళని మెత్తగా దంచొచ్చు. మన్ని కాదనేవా రెవరు!

(వెంకన్న ప్రవేశము.)

అమ్మయ్యా! రండి. అంతారండి.

కోట—కరుసంతా సీదేనా ?

వెంక—ఆహా!

గుర—అట్లయితే మనమంతా తాగుదారి. చబకెల్దాం. ఆళ్ళమాట వింటాం. నచ్చుద్దాచరే వుూరుకోందాం లేకపోద్ది నాలుగురాళ్ళు యిసుర్దారి. బుర్రలు మోత మోగాలి.

సురా—అట్లా చేశామా! మన్ని యెవరును యేమియు ననరు ?

కోట—పోలీచాళ్ళేమనరు గందా ?

సురా—అందులో వుండే పసందు చూచే వచ్చితినిగా.

కోట—అందుకనేగా! సదువుకొన్నాయన గూడా మాతో వుంటే కూసంత మంచి దెందుకైనా! అని అనుకోడం.

గురు—అయితే పదండి మరి. ప్రొద్దెక్కకుండా!

(అందఱు నిష్క్రమింతురు.

శ్రీ

# సురానంద



## అష్టమాంకము.

[ఆసుపత్రియందొక గదిలో మంచముమీఁద సురానందుఁడు గూర్చుండి ప్రవేశము].

సురా—ఒకసారి చెప్పుదెబ్బలఁ దిన్నప్పుడు తిన్నఁగా బుద్ధికలిగి యుండరాదా! ఈ దెబ్బలాట లెందులకు? ఎండు రోగముమీఁదఁ గల్లు త్రాగితే నంజురోగం కూడా సంప్రాప్తమయినది. ఇఁక నేను బ్రతికి బయటపడే మార్గమేమీ కనుపించలేదు. ఈ ఆసుపత్రిలో నాలుగు డబ్బులుంటే తిన్నఁగా చూస్తారుగాని నావంటి వారి మొగం చూడనే చూడరు. వీళ్ళ చర్యలు బావగారి మీద బరాతమువలె నుండును. ఎత్తాను జన్మ. పాడుజన్మ. ఒకరిని సుఖపెట్టితినా నేను సుఖపడితినా! తల్లిదండ్రులు చచ్చిరి. ఖైదులోఁ బెట్టినప్పుడే చచ్చిపోవలసిన భార్యా యేదో యింకా నాలుగు దినాలు భూమిమీఁదనూకలుండఁబట్టి అంతవఱకయినా బ్రతికింది. ఏకాకినైతిని, దరిద్రుఁడనైతిని, రోగినైతిని, మిత్రద్రోహినైతిని. దేశద్రోహినైతిని, బంధువిదూరుఁడనైతిని. (దగ్గుచు) ఈదగ్గుతో రాత్రింబవళ్ళు నాదుంప తెగిపోతూవుంది. ఒళ్ళంతా కట్లెమై పోయె. పొగరుఁబోతు తనంగా రౌడీ ముండవాళ్ళతో జేరి తిరిగితే పాపం యేనాటికైనా బద్ధలుకాకుండా వుంటుందా! కులగోత్రాలు లేకుండా మాలవాడితో, మంగలవాడితో, యానాదివాడితో, బుడబుక్కలవాడితో, కల్లుదుకాణాల్లో చేరి తప్పతాగిన తుప్పతులవాడిని. ఎక్కడో నరకలోకం వుందంటారు,

ఇక్కడనే వుంది ఈ శస్త్రీ లేమిటి? ఈబాధేమిటి! పాకవాళ్లు నీళ్ళు బోస్తే తాగుతున్నానా? నా బ్రాహ్మణీక మిట్లావుంది. ఓ పాడు మనస్సా! కానేపు బుద్ధి చెప్పకోరాదా! పశ్చాత్తాపముఁ జెంది భగవంతుణ్ని యిప్పుడు తలచుకొన్నా సూక్ష్మములో మోక్షమన్నా దొరకుతుంది. వేసుకో! చెంపలు వేసుకో. నీచరిత్ర లోకానికిఁ జాటు. అలనాటున్నవారిని యీఘండాలపు వృత్తిని విసర్జించుమని బోధించుము.

గీ. యశము నశియించె గౌరవ ♦ మడఁగిపోయె
ఆర్యసంతతియందప ♦ ఖ్యాతి కలిగె
ధనముక్షీణించె బలము నా ♦ శనము జెందె
రూపము హరించిపోయె నా ♦ నాసముడిగె.

గీ. గుండెలును మాడిపోయె నా ♦ యండపడియె
దుఃఖము భరింపలేక నా ♦ తోయజాక్షి
ప్రాణములఁ గోలుపోయె నీ ♦ వరుసరోగ
పూరితుఁడనౌచు బాధల ♦ పొందుచుంటి.

గీ. చేతఁగాసు లేకుండుటఁ ♦ జేసినాఁడ
దొంగతనమును భటులకు ♦ లొంగినాఁడ
చేతమలమూత్రముల పాత్ర ♦ సిగ్గులేకఁ
దాల్చిమోసితిఁ జెరనున్న ♦ తరుణమందు.

గీ. వెలవెలందికి కోరిన ♦ విధముగా నె
వ్రాసియిచ్చితి భూముల ♦ పట్టెడన్న
మునకుఁ గట్టంగగుడ్డకు ♦ మోము వాచి
బయటకుం గొట్టబడితి ని ♦ వరుసఁ తుదకు.

గీ. కోలుపోతిని గృహము లో ♦ కులకొసంగ
వలసిన ఋణంబు క్రిందను ♦ నిలువనీడ

లేక నల్లాడుచుంటి నీ ♦ లీలవారి
వారి పంచలఁ జేరి ని ♦ ర్భాగ్యవశత.

సీ. చదివితిని మూఁడుభాషల ♦ శాస్త్రములను
వేదముల నేర్చుకొంటి ని ♦ విధినిబుద్ధి
మాలిఁదిరుగుట వాటిని ♦ మంటఁబెట్టి
పశువునై పోతి మెదడును ♦ పాడుపడియె.

గీ. దుండగఁపు జట్టుతోఁగూడి ♦ దుష్క్రియాప
రుండనై వారివీరిని ♦ బండబూతు
లెల్లఁదిట్టి కొట్టినపను ♦ లెల్లనన్ను
కట్టిగుడుపు మనున్నది ♦ యిట్టులకట.

సీ. కానజనఘోష హేతువౌ ♦ కార్యములను
దవిలి చెడిపోక సత్క్రియా ♦ దక్షులగుచు
భరతమాతకు యశము గూ ♦ ర్పంగ వలయు
ఆర్యకులధర్మముల గౌర ♦ వాదులెల్ల
నిలుపవలయుఁ బ్రమోదంబు ♦ గొలుపవలయు.

[అప్పుడు కట్లగుడ్డలతోఁ గాంపౌండరు పరివార సహితుఁడై
ప్రవేశించును.]

కాంపౌం — సురానందా! బాధ యెట్లున్నది?

సురా — ఎట్లున్నదని చెప్పుదును. బ్రతికినవాఁడను గాను, చచ్చిన వాడను గాకుంటిని. దగ్గువలన నిద్దుర పట్టుట లేదు. పుళ్ళన్నియును మంటలు పోటులుపుట్టి కూర్చుండ లేను. పండుకొన లేను. నిలువఁబడ లేను. నాఅవస్థ పరమాత్ముఁడే యెఱుగ వలయును. రామ రామా!

కాంపౌం — నీనోట రామనామము వెలువడినది. ఆశ్చర్యము.

సురా — అయ్యా! నాకు వేఱుగ నరకలోక బాధలు కావలయునా!

అన్నియుఁ బొందుచుంటిని. ఏమో! ఇప్పుడైన భగవంతుని గోలు
చుకొనిన నా యవస్థలఁ దప్పించునేమో అని ఆశ-

(కట్లూడఁదీసి మఱలకట్లు గట్టుచుండ బాధతో) అమ్మయ్యా!
అనుచుండును.

శాంపా—ఇప్పుడమ్మయ్యాగా వుందా నాయనా! (అని కట్లు కట్టు
చుండును).

సురా—బాబూ! నెమ్మదిగాఁ గట్టండి. బాధకోర్వ లేకున్నాఁడను.
దిక్కులేని నాఁడననియైనఁ గటాక్షించవచ్చును.

శాంపా—దిక్కులేకేమి నీపూర్వులనెఱుఁగనా? నీ కర్మమున కెవ
రేమి చేతురు?

సురా—కర్మముగాదా మఱి!

గీ. ధనము సర్వస్వమును వృథా ♦ త్రాగుటకును
భోగములకును వెచ్చించి ♦ రోగములను
దెచ్చుకొని యీయాసుపత్రికి ♦ వచ్చి యిట్టి
బాధపొందుట కర్మాను ♦ భవమె నిజము.

అయ్యో, ఈనాస్థితిని జూచుకున్న జీవితముపై నాశయే నశిం
చుచున్నది. అక్కడనుభవించ వలసిన వెన్నియోయుండ నిక్కడఁ
గూడ నేల నేడ్పింతురు. అబ్బా! దాహము. నోరు తడియారుచున్నయది.

శాంపా—మేమెంత చేసిన నేమి ప్రయోజనము.

(డాక్టరుగారు ప్రవేశించి)

డాక్టర్—వెల్ హౌ యిజ్ పేషెన్ట్.

సురా—అయ్యో:-ఇట్లా వున్నానండి.

గీ. చావు బ్రతుకులలోన ని ♦ శ్చయము లేనొ
మెలుగలేకుండ మంచాన ♦ దొరలిదొరలి

దగ్గుచును మూల్గుచును పరా ♦ త్పరుని దయకు
నెదురు చూచుచు నున్నాఁడ ♦ నిటుల దేవ.

డాక్టర్—(రోగినిచూచి పెదవి విరచి కాంపౌడరుతో వెడలిపోవును)

సురా—(ఆయాసముగా) అయింది. సర్వమంగళ మైనది. ధనము
నకు...మానమునకు...ప్రాణమునకు నీళ్లు వదలుకొనవచ్చును ?

మ. ధనసర్వస్వము...బాడు...చేసి—జడునై...
దౌర్భాగ్యునై—త్రాగుబోతునునై—దొంగనునై...
కృతఘ్నునయి—బంధుద్రోహినై—ప్రాణకాంతను
గోల్పోయిన పాతకుండనయి...నానారోగజా
లంబు—చేతను—చావంగను—సిద్ధమైన
నను రాధాకృష్ణ—గొంపోఁగదే—:

(చెంపలు వాయించుకొని) భగవంతుఁడా! అపరాధిని- క్ష
మింపుము. తండ్రీ నీకేలదయవచ్చును ? మహాద్రోహిని. ఇది మరణ
వేదన గాఁబోలును. అరుగో- యమకింకరులు. అమ్మయ్యో ! ఎంత
భీకరముగానున్నారు. వీండ్లతో అరణ్యాలులో ముళ్లలో-పొదల్లో !
పురుగులలో- పుట్టలలో నడిచి పోవలసిందేనా ! ఆకొండల మీద
కాళ్ళుఁగాలవా ! ఎత్తులమీఁద కెక్కఁగలనా ! ఏరులు దాటవల
సిందేనా ? ఈదలేనుగదా ! నామాట వింటారా ! నామీఁదదయ
తలుస్తారా ! చేతగాదంటే పూరుకుంటారా ! యమలోక శిక్షల పుస్త
కంలో తాగుబోతునకు సీసంగాచి గొంతుకలో పోయుడంశిక్ష చెప్పి
నారే- వేడిగాదూ ? గొంతుగాలదూ? నాయట్టి పాపాత్ముఁడికీ శిక్షకా
వల్సిందే-బ్రాందివేడి. సారా వేడి. కల్లు వేడి. యిన్ని వేడులు పట్టిన నా
కడుపెంతకైనఁ దగినదే—ఏమంటారు ! రమ్మంటారా! నాయన్లారా!
ఎట్లారాను ? డాక్టరుగారితో చెప్పకుండా నేనా ? మాధవయ్యను
జూడకుండానేనా ? శాన్తటయం యివ్వరాదూ ? ఇవ్వనంటారా !

బాబుల్లారా! మా అన్నయ్యను రానీయండి. ఏమన్నా యిప్పిస్తాను. లంచా లొద్దంటారా! మీవంటి కింకరులకెందరికో యిచ్చానే? మీ కెందుకు వద్దు? పోనీయండి. ఆమిట్టిచూపు లెందులకు? మూలిగే నక్కమీద తాడిపండు పడ్డట్టుగా నామీద నేనా మీ పౌరుషము. ఏమంటారు! ఆఁ. దగ్గఱకువచ్చి చెబుతారా? అమ్మయ్యో! దగ్గఱకు రాకండి. రానవడంలేదు. వస్తాను. గదలెత్తకండి. మొత్తకండి—— (అని కనులుమూసి మఱలఁ దెఱచి ఏమిది? ఎవరును కనుపించరే? ఇది మరణవేదనమా? అదుగో! చేతులకుఁ గాళ్ళకుఁ ద్రాళ్ళనువేసి బంధిస్తూ వున్నారు. హర! హరా! వెళ్లవలసిందేనా? ఓ భారత లోకమా!

కీర్తన.

ముఖారి - రూపకం.

పోవుచున్నానో - పుణ్యలోకమా? నిన్నుఁబాసి॥ పో॥

1. జడుఁడనైచునమ్మా నీదు। కడుపునందుఁబుట్టి యిట్టి। చెడుగులఁ జేసిన దానికి॥ శిక్షపొందగ యమపురికిదె॥ పో॥

2. మదిని భర్త్సాత్తాపమంది। వదలుఁడంచు బ్రతిమాలితి। వదలము నను వుమటంచును! గదలతో బెదరించి లాగఁగ॥ పో॥

(అని ప్రాణముల వదులును)

(తెఱ వాలును.)

శ్రీ

# సురానంద



నవమాంకము.

(ప్రవేశము. మాధవరావు)

అక్కటా! కథాంతమైనది. కథానాయకుఁ డస్తమించె. లోకమున కీకథ నీతిదాయకమై వులరాజుఁ గాత ఆహా! త్రాగుడం దలవాటు పడిన వారిదురవస్థ లెంతవిపరీత స్థితిలోనున్నయవి.

మ. ధనసర్వస్వమడంగి పోవుటలు నిం ♦ దల్బొందుటల్ సఖ్యశం
బునునగ్గిన్ బడద్రోసికొంటలు కులం ♦ బున్ మట్టిపాల్సేయుటల్
జనఘోషంబున మెల్గి రోగములతో ♦ చావందుటల్ ఆసుప
త్రినియుద్దేశలమై చెలంగెఁగద ధా ♦ త్రిన్ మద్యపాహీంలకున్.

ఓ భారతాంబా! భారతాంబా!

భరత—(ప్రవేశించి) ఎవ్వారీ భక్తుఁడు నన్నుస్మరించి నాఁడు.

మాధ—(సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి) తల్లీ! నీవే నమ్మా! భారతాంబవు? నీరూపంబునుజూచి నీవే భారతాంబవని భవద్దర్శన భాగ్యంబు లభియించుటఁజేసి పుట్టెడు దుఃఖములో నుండియు సంతసించు చున్నాఁడను.

భరత—నాయనా! భారతీయా! ఈనారూప మిప్పటిది గాదు.

సీ. ఏనాఁడు నాపాల ♦ నీబ్రాంది దిగినదో
యానాఁడె యీరూప ♦ మందినాను
ఏనాఁడు సారాయ ♦ మెల్లెడవెలిగెనో
యానాఁడె యీరూప ♦ మందినాను